CHAITANYAMANAVI
R.NO.APBIL/2019/78298

# చైతన్య మానవి

VOL : 2 ISSUE : 10,11 GUNTUR, OCTOBER, NOVEMBER, 2020 52 PAGES RS. 20/-



శక్తికి
ప్రతిరూపం ...
ఉత్పత్తి రంగంలో ఉక్కు
శ్రమకు నిదర్శనం ...
బహుముఖ
పనుల సమర్థతకు
చిరునామా ..
కుటుంబానికి
అసలైన
యజమాని...







కేంద్ర కమిటీ పిలుపులో భాగంగా

# ఐద్వా నిరసనలు

జీవనం, జీవనోపాధి కోసం

## వేతన పోరు!

హిందూపురం గార్మెంట్ ఫ్యాక్టరీలో జీతాలు పెంచాలని డిమాండ్ చేస్తూ ఫ్యాక్టరీ ఎదుట కార్మికులు భారీ ధర్నా నిర్వహించారు. వేతనాలు పెంచే వరకు ఉద్యమం ఆపబోమని హెచ్చరించారు.



విశాఖ జిల్లా అరకులో..




గుంటూరు జిల్లా వినుకొండలో ...




న్యూఢిల్లీలో...




అనంతపురంలో...




విజయవాడ ప్రభుత్వాసుపత్రి ఎదుట...




కాకినాడలో...

సంపాదకీయం

# బంధనాలు తెంచు.. విజయం సాధించు!

ఆదిశక్తిగానూ, ముగ్గురమ్మలకు మూలపుటమ్మగానూ మహిషాసురమర్ధనిగానూ, సకల రూపాల శక్తి స్వరూపిణిగానూ స్త్రీ దసరా సందర్భంగా పూజలందుకుంటోంది. రామాలయమో, వెంకటేశ్వరస్వామి గుడో, చర్చో, మసీదో లేకపోవచ్చుగానీ గ్రామదేవత లేని ఊరు ఉంటుందా?

మాతృస్వామ్య సమాజం సంస్కృతికివి చిహ్నాలు. ఒకవైపు దుర్గామాతగానూ, సకల శక్తి స్వరూపిణిగానూ పూజలందుకుంటున్న స్త్రీ, మరో వైపు అబలగానూ చిన్న వయసులో తండ్రి, వివాహమైన తరువాత భర్త, వృద్ధాప్యంలో కొడుకు రక్షణలో ఉండాలన్న బలమైన భావజాలపు సంస్కృతిలో బంధీగా ఉంది. ఇది యాదృచ్ఛికమా? పరిణామా క్రమమా? స్త్రీలకు గౌరవమిచ్చే సంస్కృతి మనది అని గొప్పలు చెప్పుకునే చోట పసిబిడ్డలపైనా, పండు ముసలివాళ్లపైనా అత్యాచారాలు చేయడం ఎవరో కొందరు దారితప్పిన దుర్మార్గమా? లేక వ్యవస్థీకృతమా?

స్త్రీ తల్లిగానూ, చెల్లిగానూ, కూతురిగానూ బహుముఖ పాత్రధారిగా ప్రశంసలు అందుకుంటోంది. కానీ ఆమె కూడా పురుషుని మాదిరిగానే స్వతంత్ర కార్యాచరణ, ఆలోచన ఉన్న వ్యక్తిగా గుర్తిస్తున్నామా? స్త్రీలకు సంస్కారం నేర్పాలనే పెద్దలు, పురుషులకు ఉండాల్సిన సంస్కారం గురించి ఎందుకు మాట్లాడటం లేదు?

స్త్రీలు తమ కాళ్ల మీద తాము నిలబడలేని అశక్తులా? తమ జీవనానికి అవసరమైన పనిని ఎంపిక చేసుకుని జీవించలేరా? పురుషుడి అండ లేకుండా స్త్రీలు జీవించటం కష్టమా? స్త్రీలకు, పురుషులకు మధ్య అసలు పోటీ అవసరమా? ప్రకృతిలో స్త్రీ, పురుషులు ఒకరినొకరు పరిపూర్ణం చేసుకునే భాగస్వాములు కారా?

మగడువేల్పన పాతమాట

ప్రాణమిత్రుడనీకు అన్న సంస్కృతి కాదా ఉండాల్సింది.

మరి.. ఈ వైరుధ్యం, ఈ ఆధిపత్యానికి మూలలాలేమిటి? బాకోఫెన్, హెగల్ లాంటి సామాజిక పరిశోధకుల పరిశోధనలను శాస్త్రీయంగా ఔపోసన పట్టిన ఏంగిల్స్ సొంత ఆస్తి ఆవిర్భావంలో ఈ వైరుధ్యముందన్నాడు. స్త్రీ,పురుషుల మధ్య నిజమైన ప్రేమ, గౌరవాలు సొంత ఆస్తి నిర్మూలనతోనే సాధ్యమన్నాడు.

ఈ కోవిడ్ కష్టకాలంలో మరింత వేగంగా కార్పొరేట్ల ఆస్తులు పెరగడం చిన్నవ్యాపారులతో సహా సామాన్య, మధ్యతరగతి ప్రజల జీవితాలు, పని, ఆస్తులు కరిగిపోవడం త్రీడీఫిల్మ్‌లో కనిపిస్తోంది. ఈ సొంత ఆస్తి భావనే స్త్రీల స్వేచ్ఛను హరించి, ఆమెకు ఇనుప కచ్చడాలు తగిలించి కులటగానూ, పతివ్రతగానూ మార్చి సొంత వ్యక్తిత్వాన్ని హననం చేసిన చరిత్ర మానవ సమాజాలన్నింటా కనిపిస్తోంది.

అణచివేతను ప్రశ్నించిన ఆధునిక సమాజం స్త్రీల అణచివేతను కూడా ప్రశ్నించడం ప్రారంభించింది. స్త్రీలకు ప్రకృతి నిర్మాణంలో ఉన్న అసాధారణ శక్తిని సైన్సు కూడా నేడు ధృవీకరిస్తోంది. మరో జీవికి జన్మనిచ్చేందుకు కావల్సిన కండర బలం, జీవశక్తి ఆమె శరీర నిర్మాణంలో భాగం. ఆడబిడ్డలను పిండదశలో హతమార్చే వికృత సంస్కృతి లేకుండా ఉంటే పురుషుల కంటే స్త్రీల జనాభా అధికంగా ఉంటుంది. సమాజ జీవనానికి, శ్రమకు అవసరమైన మానవ వనరులను రక్షించడం, పెంచడం తీర్చిదిద్దడం పిండ దశ నుంచే (స్త్రీలు నిర్వహించాల్సి) రావడం వారి ప్రత్యేకతను చాటి చెబుతోంది. మాతృమూర్తిగా బిడ్డలను కనడం, పెంచడం మాత్రమే కాదు, సమస్త జీవనానికి అవసరమైన సహస్ర వృత్తులను ఆమె అన్వేషించింది. ఆవిష్కరించింది. ఔపోసన పట్టింది. సకల ఆయుధాలను ధరించి ఆటంకాలను అధిగమిస్తూ ప్రకృతిలో విజయ దుర్గాగా వీరవిహారం చేసింది. అటువంటి స్త్రీ మూర్తి శ్రమ విభజనలో తనకు తానుగా బిడ్డల పోషణ కోసం విధించుకున్న పరిమితులలో పురుషులు అస్త్రశస్త్రాలను స్వాధీనం చేసుకుని నిషేధాల చట్టాన్ని క్రమేణా విస్తరింపజేశారు.

ఈ రోజు స్త్రీలు తమ శక్తి సామర్ధ్యాలను వ్యక్తీకరించుకునేందుకు ఈ నిషేధ చట్రాలను బద్ధలు కొట్టాల్సిన తరుణం ఆసన్నమయింది. వ్యక్తిగత ఆస్తి కేంద్రంగా సాగే మనువాద, మతవాద, పితృస్వామిక సంస్కృతి స్త్రీల శ్రమను చులకన చేస్తోంది. వారి శ్రమను లెక్కలేనంతగా దోపిడీ చేస్తోంది. ఈ వాస్తవాలను మహిళలు గమనించకుండా అనేక మాయపొరలను సృష్టించారు. ఈ మాయనే ఛేదించాలి. గురజాడ అన్నట్లు స్త్రీలు వంటింటిని బద్ధలుకొట్టాలి. ఉత్పత్తిలో తమ వాటా సాధించుకోవాలి. శ్రామికులుగా, ఉద్యోగినులుగా పురుషుడితో ధీటుగా పని చేస్తున్న మహిళలు సబలలం మేం అంటూ ఆటంకాలను ఎదుర్కొంటూ సంఘర్షిస్తూ విజయాలను సాధిస్తున్న అడుగులలో సామూహికంగా కదంతొక్కాలి. ఆధారపడే జీవితాన్ని తోసేయాలి. అందరికీ ఆధారంగా మారాలి. అప్పుడే స్త్రీలకూ, సమాజానికీ నిజమైన విజయం.

# చైతన్య మానవి

సంపుటి : 2
సంచిక : 10,11

సనాతన ఆచారాలు, సాంప్రదాయాలు కూడా ప్రమాదకర శత్రువులే. విప్లవ పురోగమనాన్ని అవి అంతర్లీనంగా అడ్డుకుంటాయి. మనం వాటిని అణచివేయలేం గానీ.. సుదీర్ఘ కాలంలో అత్యంత జాగరూకతతో, పట్టుదలతో సరిచేయాల్సి ఉంది.

- హోచిమిన్

## ఈ సంచికలో

| | |
|---|---|
| సమకాలీనం | 1. విషయం చిమ్ముతున్న వ్యవసాయ బిల్లు - బి.హరితాదేవి........................5 |
| స్పందన | 2.వాణిజ్య ప్రకటనలనూ వదలని మతోన్మాద శక్తులు - ఎం.ప్రగతి.............................8 |
| ధారావాహిక | 3.పెళ్లి ముచ్చట్లు! - వేములపల్లి సత్యవతి................10 |
| కథ | 4.మూఢత్వం వదిలెయ్! - మహాసముద్రం దేవకి................11 |
| పోటీలు | 5.మహిళా ధైర్యం చెయ్! - ఎస్కెపి బేగం........................16 |
| ధారావాహిక | 6. కఠినమైన వివాహ చట్టాలు - అగస్ట్‌బెబెల్........................ 17 |
| స్ఫూర్తి | 7. వివక్ష ఎందుకు - నండూరి పద్మాంజలి .............18 |
| అభ్యుదయం | 8. అసాధారణ మహిళ రూత్ బాడర్ గిన్స్ బర్గ్ - అరుణ (అనువాదం) ........... 20 |
| నమ్మకాలు-శాస్త్రీయత | 9. స్వాములు, సన్యాలు ఏమైపోయారు! - డాక్టర్ విజయబక్ష్................. 22 |
| యువత | 10. ఈ స్ఫూర్తి ఎప్పుడూ కొనసాగాలి - మానవి బృందం ................. 24 |
| పోరాటం | 11. 'నిర్భయ'ంతో మొదలై నిబ్బరంగా ముందుకు! - మానవి బృందం .................... 26 |
| పోటీలు | 12. మహిళలు-చైతన్యం - జి.గంగాదేవి........................ 27 |
| అమ్మమ్మ లేఖలు | 13. ప్రజల ప్రసక్తిలేని ప్రజాస్వామ్యం! - డాక్టర్ విజయబక్ష్................ 28 |
| ఆదర్శం | 16. నదిని బతికించుకున్నారు! - ఈనాడు సౌజన్యం................. 33 |
| జీవనయానం | 20. లోపాలన దాటుకని ఆనందపు అంచుల్లోకి.. - కె.శారద .......................... 35 |
| పుస్తక సమీక్ష | 21. బతుకెట్టా! - రాఘవరెడ్డి ........................ 37 |
| చిత్ర సమీక్ష | 22. సామూహిక పొలికేక హెలారో! -శివలక్ష్మి.............................. 39 |



**ఐద్వా ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
పి.ఎల్.రావు భవన్, 2/7 బ్రాడీపేట,
గుంటూరు, గుంటూరు జిల్లా - 522002,
ఆంధ్రప్రదేశ్, ఫోన్ : 9490098620

chaitanyamanavi@gmail.com
fb : aidwaap
Blog : aidwaap@blogspot.com

**సంపాదకులు**
**డి.రమాదేవి**

**సంపాదక వర్గం**
కె. స్వరూపరాణి
బి. ప్రభావతి
బి.హరిత
మేనేజర్ : కె. శారద

ప్రజాశక్తి ప్రింటర్స్ & పబ్లిషర్స్
ప్రైవేట్ లిమిటెడ్

**పోస్టల్ చందా**
సంవత్సరానికి రూ : 150/-
విడి ప్రతి వెల రూ : 10/-

వ్యాసాలు, లేఖలు పంపించవల్సిన చిరునామా :
డోర్‌నెం. 31-5-6, మారుతీనగర్,
ప్రకాశరావు వీధి, చుట్టు గుంట సెంటర్,
విజయవాడ - 4

పత్రికలో విభిన్న అంశాలపై వస్తున్న వ్యాసాలు రచయితల అభిప్రాయాలు మాత్రమే. అందులో పేర్కొన్న అన్ని అంశాలతో మానవి సంపాదక వర్గం ఏకీభవిస్తుందని భావించవలదు. **- ఎడిటర్**

PRINTED AND PUBLISEHD BY D. RAMA DEVI, AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM, PRINTED AT PRAJASAKTI PRINTERS & PUBLISHERS PVT. LTD. 14-12-19, PRAKASH NAGAR, KRISHNA NAGAR (P), TADEPALLI (M), GUNTUR DIST.PUBLISHED AT AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM AIDWA STATE OFFICE P.L.RAO BHAVAN, 2/7 BRODIPET, GUNTUR-522002, ANDHRA PRADESH STATE. EDITOR: D. RAMA DEVI. R.NO. APBIL/2019/78298

B. హరితాదేవి

# విషం చిమ్ముతున్న వ్యవసాయ బిల్లు



కేంద్రం మూణ్నెళ్ల కిందట తీసుకొచ్చిన మూడు ఆర్డినెన్సులు

1) నిత్యవసర సరకుల(సవరణ) బిల్లు (ది ఎసెన్షియల్ కమోడిటీస్(అమెండమెంట్) బిల్ -2020.2) రైతు ఉత్పత్తుల వాణిజ్య, వ్యాపార (ప్రోత్సాహక, సులభతర) బిల్లు (ది ఫార్మర్స్ ప్రొడ్యూస్ ట్రేడ్ అండ్ కామర్స్(ప్రమోషన్, ఫెసిలిటేషన్) బిల్) 3) రైతుల (సాధికారత, రక్షణ) ధర హామీ, సేవల ఒప్పంద బిల్లు-2020(ది ఫార్మర్స్ ఎంపవర్మెంట్ అండ్ (ప్రొటెక్షన్) అగ్రిమెంట్ ఆన్ ప్రైస్ అస్యూరెన్స్ అండ్ ఫార్మ్ సర్వీసెస్ బిల్ - 2020) సెప్టెంబర్ నెలలో లోక్‌సభలో ఆమోదం పొందాయి. వీటిపై దేశవ్యాప్తంగా రైతులు ఆందోళనలు చేస్తున్నారు. ముఖ్యంగా పంజాబ్,హర్యానా లో రైతుల ఆందోళనలు ఎక్కువగా వున్నాయి.ఈ బిల్లుకు వ్యతిరేకంగా పంజాబ్ అసెంబ్లీ తీర్మానం చేసింది.

**నిత్యవసర సరకుల(సవరణ) బిల్లు**

ప్రస్తుతం అమలులో వున్న 1955 నిత్యవసర సరుకుల చట్టానికి కొన్ని సవరణలతో ఈ బిల్లు తెచ్చారు. నిత్యవసర సరకుల జాబితాలో ఉన్న వస్తువుల ఉత్పత్తి, సరఫరా, పంపిణీ, వాణిజ్యాల నియంత్రణాధికారం కేంద్రానికి దఖలు పరుస్తుందీ చట్టం.వ్యవసాయరంగంలో పోటీ, రైతుల ఆదాయం పెంచడానికి ఉద్దేశించిన చట్టంగా ఆర్డినెన్సులో పేర్కొన్నారు. వినియోగదారుల ప్రయోజనాలు రక్షిస్తూనే నిత్యావసరాలపై నియంత్రణ వ్యవస్థను సరళీకరించడం దీని ఉద్దేశమని ఆర్డినెన్సులో ఉంది. ఆహార ఉత్పత్తులపై నియంత్రణ: కొన్ని రకాల ఆహార పదార్థాలు, ఎరువులు, పెట్రోలియం ఉత్పత్తులు వంటివి నిత్యావసరాలుగా పేర్కొనడానికి ఈ చట్టం కేంద్ర ప్రభుత్వానికి అధికారం ఇస్తుంది. అలాంటి నిత్యవసరాల ఉత్పత్తి, సరఫరా, పంపిణీ, వాణిజ్యాన్ని నియంత్రించడానికి, నిషేధించడానికి కేంద్రానికి అధికారం ఉంటుంది. యుద్ధం, దుర్భిక్షం, ధరలు విపరీతంగా పెరిగిపోవడం, ప్రకృతి విపత్తులు వంటి అసాధారణ పరిస్థితులు తలెత్తినప్పుడు తృణధాన్యాలు, పప్పులు, బంగాళాదుంపలు, ఉల్లి, నూనెగింజలు, నూనెలు వంటి ఆహారవస్తువులలో వేటి సరఫరానైనా నియంత్రించే అధికారాన్ని కేంద్రానికి ఇస్తుందీ చట్టం. ఏదైనా నిత్యావసర వస్తువును ఒక వ్యక్తి ఎంత పరిమాణంలో నిల్వ చేసుకోవచ్చనే నియంత్రణ విధించే అధికారమూ కేంద్రానికి కల్పిస్తుందీ చట్టం.

**రైతు ఉత్పత్తుల వాణిజ్య, వ్యాపార(ప్రోత్సాహక, సులభతర) బిల్లు**

వ్యవసాయ మార్కెట్లను నియంత్రించే మార్కెట్ కమిటీలకు ప్రాదేశిక సరిహద్దులతో సంబంధం లేకుండా దేశంలో వేర్వేరు రాష్ట్రాల మధ్య, రాష్ట్రాల్లో జిల్లాల మధ్య స్వేచ్ఛా వాణిజ్యానికి ఇది అవకాశం కల్పిస్తుంది. మార్కెట్ కమిటీల సరిహద్దులు దాటి విక్రయించే వ్యవసాయ ఉత్పత్తులపై రాష్ట్రాలు కానీ, స్థానిక ప్రభుత్వాలు కానీ ఎలాంటి పన్నులు వేయడానికి, ఫీజులు వసూలు చేయడానికి వీల్లేదు.

**ఎలక్ట్రానిక్ ట్రేడింగ్:** నిర్దేశిత వాణిజ్య ప్రాంతంలో రాష్ట్రాల వ్యవసాయ మార్కెట్ కమిటీల నియంత్రణలోకి వచ్చే ఉత్పత్తుల ఎలక్ట్రానిక్ వర్తకానికి(ఈ-వర్తకం) ఇది అనుమతిస్తుంది. ఆన్‌లైన్ క్రయవిక్రయాల కోసం ఎలక్ట్రానిక్ ట్రేడింగ్ వేదికను ఏర్పాటు చేయొచ్చు. పాన్ కార్డు ఉన్న కంపెనీలు, భాగస్వామ్య సంస్థలు, రిజిస్టర్డ్ సొసైటీలు, ఫార్మర్ ప్రొడ్యూసర్ ఆర్గనైజేషన్, వ్యవసాయ సహకార సంస్థలు ఏవైనా ఇలాంటి ఆన్‌లైన్ వర్తక వేదికను ఏర్పాటు చేయొచ్చు. ఈ బిల్లులు రైతులకు మంచి చేస్తాయి అని ప్రభుత్వం చెబుతుండగా వాస్తవంగా ఇవి రైతులను భూమికి దూరం చేసి వ్యవసాయాన్ని కార్పోరేట్ పరం చెయ్యటానికి దారులు వేసాయి..

స్వాతంత్ర్యానికి పూర్వం రైతాంగానికి ప్రభుత్వం నుండి ఎటువంటి మద్దతూ ఉండేది కాదు. దాంతో వారు పూర్తిగా పెట్టుబడిదారీ మార్కెట్ పైనే ఆధారపడ్డారు. 1930 దశకంలో వచ్చిన మహా మాంద్యం కాలంలో ఆ మార్కెట్ తాకిడికి రైతులు పూర్తిగా చితికిపోయారు. ఇప్పుడు తాజాగా చేసిన చట్టాలు మళ్ళీ రైతులను అటువంటి పరిస్థితులలోకి నెడుతున్నాయి. ఈ చట్టాలు కోట్లాది చిన్న రైతులను అతి కొద్ది మంది శక్తివంతులైన కొనుగోలుదారుల దయాదాక్షిణ్యాలకు వదిలిపెడుతున్నాయి. కొనుగోలుదారుడి గుత్తాధిపత్యపు దోపిడీకి రైతాంగం బలి కానుంది. ఈ బిల్లును కొన్ని రాష్ట్రాలు ,రైతాంగం వ్యతిరేకించటానికి కారణాలు

1. రాజ్యాంగం లోని 7వ షెడ్యూలు ప్రకారం వ్యవసాయం రాష్ట్రాల పరిధి లోకి

వస్తుంది. అయినప్పటికీ కేంద్రం ఏకపక్షంగా వ్యవసాయ మార్కెటింగుకు సంబంధించి మౌలికమైన మార్పులను చట్ట రూపంలో తీసుకురావడం ఫెడరలిజానికి పెద్ద దెబ్బ.

2. చట్టంలో మద్దతు ధరను చేర్చడానికి ప్రభుత్వం తిరస్కరించింది. స్వామినాథన్ కమిటీ రైతుకు కనీస మద్దతు ధర పొందే హక్కు ఉందని, పెట్టుబడికి తోడు అదనంగా 50 శాతం కలిపి మద్దతు ధరగా ప్రకటించి అమలు చేయాలని నిర్దేశించింది. కాని మోడీ ప్రభుత్వం దానిని నిరాకరించి రైతులను మార్కెట్ దయాదాక్షిణ్యాలకు వదిలిపెట్టింది.

3. కాంట్రాక్టు వ్యవసాయ పద్ధతి ఫలితంగా ఆహారధాన్యాల కోసం వినియోగించే భూమిని ఇతర వ్యవసాయ ఉత్పత్తుల కోసం మళ్ళించడం పెరుగుతుంది. అంటే ప్రజలకు అవసరమైనవి కాకుండా కార్పొరేట్ లకు అవసరమైనవి పండించటం. కాంట్రాక్ట్ వ్యవసాయం కార్పోరేట్, విదేశీ కంపెనీలతో చేసుకోవాలి. అంటే పండించే రైతు తినడానికి కాకుండ అమెరిక, ఆస్ట్రేలియా, జపాన్, జర్మనీ వాళ్లకు అవసరమైన పంట పండించాలి.

4. దేశ ఆహార భద్రత దెబ్బతిని తిండి గింజల కోసం సామ్రాజ్యవాద దేశాల ముందు నిలబడవలసిన పరిస్థితి వస్తుంది.

5. నిత్యావసర సరుకుల సవరణ బిల్లు అంటే అయిల్, ఉల్లి, బంగాళా, పప్పులు, చిరుధాన్యాలు లాంటి వాటిని నిత్యవసర సరుకుల నుండి తొలగించి విలాస వస్తువులుగా మార్చడం.

ఆంధ్ర ప్రదేశ్ లో 66లక్షల మంది రైతుల్లో 90.79%మంది మూడు ఏకరాల లోపు ఉన్నావారే. వీరి సగటు ఉత్పత్తి 20టన్నులు. వీరు ఎక్కడైనా అమ్ముకోవచ్చు ఇది బిల్లు, ఎంతకి అమ్ముకోవాలో చెప్పలేదు. ఎవరికి అమ్ముకోవాలో చెప్పలేదు. అలాగే పంటను వేసేటప్పుడే కోనుగోలు చేయవచ్చు కాబట్టి పంట ఖర్చులకు ఇచ్చి వారి పంటను ముందే కొనుగోలు చేసే స్వేచ్ఛ వ్యాపారులకుఇచ్చి ఇది రైతులకు లాభం అని చెప్పడం నేతి బీరకాయలో నెయ్యి ఉందని చెప్పడమే. గుత్త కొనుగోలు దారుల నుండి రైతులకు



ఎటువంటి ఇబ్బందీ రాబోదని కనీస మద్దతు ధర విధానం కొనసాగుతుందని చెప్తున్నారు. కాని ఆ విషయం ఆ బిల్లుల్లో ఎక్కడా పేర్కొనలేదు. ఈ విషయంలో ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల మాదిరిగానే మోడీ కూడా వ్యవహరిస్తున్నారు. బహిరంగ మార్కెట్‌లో ధరలు చాలా భయంకరంగా కిందా, మీదా అవుతూంటాయి. వాటి వత్తిడిని రైతులు తట్టుకోలేరు. అప్పులపాలై, దివాలా తీయడం ఖాయం. ఆ పరిస్థితి తమకు రాకూడదనే ఇప్పుడు రైతులు ఈ చట్టాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు.

ఈ బిల్లులు జాతీయోద్యమ కాలంలో రైతులకు ఇచ్చిన హామీలకు ద్రోహం చేస్తాయి. అయితే మోడీ మాత్రం అటువంటిదేమీ లేదని నమ్మబలుకుతున్నారు. ఈ విషయమై జరుగుతున్న చర్చలో ఒక ముఖ్యమైన విషయం పక్కకు పోతోంది. ఈ చట్టాల వలన రైతాంగానికి వాటిల్లనున్న కష్ట, నష్టాల గురించే చర్చిస్తున్నారు తప్ప దేశ ఆహార భద్రత గురించి ఎవరూ మాట్లాడడం లేదు.

ఒకసారి దేశ ఆహార భద్రత అనగానే ఆ చర్చ సామ్రాజ్యవాదాన్ని తెర పైకి తీసుకొస్తుంది.

భారతదేశం వంటి దేశాలకు ఆహారభద్రత అంటే ఆహారోత్పత్తిలో స్వయం సమృద్ధిని సాధించడమే. దానికి బదులు దిగుమతులపై ఆహారం కోసం ఆధారపడడం ఏవిధంగా చూసినా సరైన విధానం కాజాలదు. 1965-66, 1966-67 సంవత్సరాల్లో మన దేశంలో చాలా పెద్ద ఎత్తున పంటనష్టం జరిగింది. ప్రత్యేకించి బీహార్ లో తీవ్రమైన కరువు ఏర్పడింది. దీంతో మన దేశం ఒక బిచ్చగాడి మాదిరి అమెరికా ముందు బొచ్చె పట్టుకుని నిలబడాల్సి వచ్చింది. అప్పుడు దిగుమతి చేసుకున్న

తిండిగింజలను ఆ నౌకల వద్దే ప్రజలకు పంపిణీ చేయాల్సినంత కాటకం వచ్చిపడింది. అప్పటి ఆహార మంత్రి జగజ్జీవన్‌రామ్‌ను ప్రధాని ఇందిరా గాంధీ ఆహారం విషయంలో స్వయంసమృద్ధి సాధించే లక్ష్యంతో పని చేయాలని కోరారు. అప్పుడే హరిత విప్లవం మొదలైంది. ఇప్పటికీ మనం ఇంకా అందరికీ సమృద్ధిగా తిండి అందించగలిగేంత స్థాయికి ఎదగలేదు కాని తిండి కోసం దిగుమతులపై ఆధారపడే స్థితిలో మాత్రం లేము. ప్రజల కొనుగోలుశక్తి దారుణంగా హరించుకు పోతూండడంతో ప్రపంచంలోనే అత్యంత ఆకలిగొన్న జనం ఉన్న దేశంగా నేడు మనం ఉన్నాం.

మన దేశంలో 1966-67 అనుభవాల తర్వాత కనీస మద్దతు ధర, సేకరణ ధర, పంపిణీ ధర, మార్కెట్‌లో ధాన్యం సేకరణ విధానం, ప్రజా పంపిణీ వ్యవస్థ, సబ్సిడీలు వంటి అంశాలతో ఒక విస్తృతమైన విధానం రూపొందింది. అటు ఉత్పత్తిదారుల (రైతుల) ప్రయోజనాలు, ఇటు వినియోగదారుల (ప్రజల) ప్రయోజనాలు రెండింటినీ సర్దు బాటు చేయడమే గాక, ఆహార ధాన్యాల విషయంలో ఎటు వంటి దిగుమతుల అవసరమూ లేకుండా చేయగలిగారు. ఈ మొత్తం ఏర్పాటు నయా ఉదారవాదానికి పూర్తిగా భిన్నం. దీనివలన కార్పొరేట్ల లాభాలు రానురాను తగ్గిపోతూ వుంటాయి.

ఇండియా వంటి దేశాలు తమ ఆహార అవసరాల కోసం దిగుమతుల పైన ఆధారపడే పరిస్థితి ఉండాలని సామ్రాజ్య వాదం కోరుకుంటుంది. మన దేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తి కోసం వినియోగిస్తున్న భూమిని సామ్రాజ్యవాదులకు అవసరమైన పంటలను పండించడానికి మళ్ళించాలని చూస్తుంది "ఇంత హెచ్చు జనాభా ఉన్న మన దేశం ఆహారధాన్యాల దిగుమతి కోసం ప్రపంచ మార్కెట్ లోకి అడుగు పెడితే ఆహార ధాన్యాల ధరలు అమాంతం ఎగబాకుతాయి. మనం దిగుమతుల కోసం చాలా ఎక్కువ ధర చెల్లించాల్సి వస్తుంది. ఆ మోతాదులో దిగుమతులు చేసుకుంటే చెల్లించడానికి మన వద్ద చాలినంత విదేశీ మారక ద్రవ్యం ఉండకపోయే ప్రమాదం ఉంది. ఏదో ఒక విధంగా దిగుమతి చేసుకున్నా ఆ ధర చెల్లించి కొనగలిగే స్థోమత మన ప్రజలకు ఉండదు. అదనపు ఆహారధాన్యాల నిల్వలు సామ్రాజ్యవాద దేశాల దగ్గరే ఉంటాయి. కనుక అధిక ధరకైనా సరే మనం కొనుక్కోవాలంటే ఆ సామ్రాజ్యవాదుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసి వస్తుంది. నిజానికి తమకు అనుగుణంగా వ్యవహరించేలా లొంగదీసుకోవడం కోసం ఆహార కొరతను ఒక శక్తివంతమైన ఆయుధంగా సామ్రాజ్యవాద దేశాలు ఉపయోగిస్తాయి." అంటారు ప్రముఖ ఆర్థిక వేత్త ప్రభాత్ పట్నాయక్. వలసపాలన కాలంలో కూడా ఇదే జరిగింది. అంతవరకూ ఆహార పంటలను పండించే భూములను నల్లమందు, నీలిమందు వంటి పంటలను పండించేందుకు మళ్ళించారు. బెంగాల్ ప్రెసిడెన్సీలో ఇది ఎక్కువగా జరిగింది. ఆ తర్వాత రైతులను వ్యాపారులు దారుణంగా పీడించారు. మళ్ళీ అటువంటి దుర్భర పరిస్థితులు తమకు రాకూడదనే నేడు రైతాంగం కోరుకుంటున్నారు. ఇంతవరకూ అమలులో ఉన్న మార్కెటింగు విధానం రైతుల ప్రయోజనాలను పూర్తిగా కాపాడలేకపోయినా, కనీసం భూవినియోగాన్ని ఆహారధాన్యాల పంటల నుండి ఇతర పంటల వైపు మార్చలేదు. ఆ విధానాన్ని మార్చివేయడం వలన భూవినియోగం మారిపోయి దేశ ఆహార భద్రతకు ముప్పు వాటిల్లుతుంది. భూమి పరిమితమైన వనరు. అందుచేత భూవినియోగాన్ని సామాజికంగానే నియంత్రించాలి. ఆ విధంగా నియంత్రిస్తున్నందున రైతులకు గిట్టుబాటు ధర గ్యారంటీ చేయడం సమాజం బాధ్యత అవుతుంది. ఇందుకు ప్రస్తుత ఏర్పాటు తోడ్పడుతుంది. కాని దానినే మోడీ ప్రభుత్వం ధ్వంసం చేస్తోంది.

ఇప్పుడున్న ఏర్పాటులోని లోపాలను సరిదిద్దే బదులు ఏకంగా దానిని నాశనం చేస్తోంది. అందువల్ల భూమి వినియోగాన్ని సామాజికంగా నియంత్రించగల శక్తిని ప్రభుత్వం కోల్పోతుంది. సామ్రాజ్యవాదం కోరుకుంటున్నది ఇదే. బిజెపి ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని సంతృప్తిపరిచే పనిలో నిండా మునిగివుంది.

సోషలిస్టు విధానం అమలులో లేని మూడో ప్రపంచ దేశాల భూభాగంలో ఈ సామాజిక నియంత్రణ అవసరాన్ని గుర్తించి అమలు చేస్తున్న ఒకే ఒక ప్రాంతం కేరళ రాష్ట్రం. అక్కడ వరి పండించే భూములను ఇతర పంటల వైపు మరల్చ డానికి వీలు లేకుండా చట్టాన్ని చేశారు. ఇటువంటి చట్టాలు అక్కడి ప్రభుత్వపు సూక్ష్మగ్రాహ్యతను సూచిస్తే, కేంద్రం చేసిన చట్టాలు దాని బుద్ధిమాంద్యాన్ని సూచిస్తున్నాయి అంటున్నారు ప్రభాత్ పట్నాయక్.

# సోషలిస్టు వ్యవస్థలోనే ధరల నియంత్రణ

**- డాక్టర్ శృతి గోపాలన్, ఆర్థిక వేత్త**

సోషలిస్టు వ్యవస్థతోనే నిత్యావసర వస్తువుల ధరలు నియంత్రణలో ఉంటాయనీ, ఆహార పదార్థాల నాణ్యతకు భరోసా ఉంటుందని ప్రముఖ ఆర్థికవేత్త డాక్టర్ శృతి రాజగోపాలన్ అభిప్రాయపడ్డారు.

ఆలోచనాపరుల వేదిక 'మంథన్' సంవాద్ ఆధ్వర్యంలో భారతదేశంలో పాలన - ప్రభుత్వ సామర్థ్యంపై ఆమె ఆన్‌లైన్ వెబినార్‌లో ప్రసంగించారు.

ఆహారపదార్థాల అమ్మకాలను మార్కెట్‌కు అప్పగించిన తర్వాత దాన్ని నియంత్రించే శక్తి ప్రభుత్వం కోల్పోతుందని అన్నారు. ఆహారకల్తీకి సంబంధించి ఒక కేసులో ప్రేమ్‌చంద్ అనే వ్యక్తికి 38 ఏండ్ల తర్వాత శిక్ష పడిందని ఆమె గుర్తుచేశారు. జనాభాకు ప్రాతిపదికన న్యాయమూర్తుల పోస్టులను మంజూరు చేయడం లేదనీ, పోస్టులు కూడా చాలా వరకు భర్తీ చేయడం లేదని ఆందోళన వ్యక్తం చేశారు. దీంతో కేసుల విచారణకు సుదీర్ఘకాలం పడుతున్నదని వ్యాఖ్యానించారు.



1948లో కనీస వేతనాల చట్టం వచ్చిందనీ, అయితే ఆ చట్టం అమలును తనిఖీ చేయాల్సిన అధికారులు ఇప్పటికీ సరిపడినంతగా లేరని ఆవేదన వ్యక్తం చేశారు. ఐఎల్‌ఓ ప్రతి 40 వేల మందికి ఒక తనిఖీ అధికారి ఉండాలనీ సిఫారసు చేస్తే 1.2 లక్షల మందికి ఒకరు మాత్రమే ఉన్నారని తెలిపారు.

ప్రభుత్వ తప్పుడు విధానాల కారణంగా దేశంలో 80 శాతం మంది బలవంతంగా అసంఘటిత రంగ కార్మికులుగా మారిపోతున్నారని వివరించారు. ప్రభుత్వ విద్యావ్యవస్థను కాపాడలేకపోయారనీ, సౌకర్యాలు కల్పిస్తున్నా కీలకమైన ఉపాధ్యాయుల నియామకాలను విస్మరించారని తప్పుపట్టారు.

ఎం.ప్రగతి

# వాణిజ్య ప్రకటనలనూ వదలని.. మతోన్మాద శక్తులు

'నా ఆటోగ్రాఫ్' సినిమా చూశారా మీరు? అందులో ప్రకాష్‌రాజ్‌కు సంబంధించిన ఓ అడ్వర్టయిజింగ్ ఏజెన్సీలో పనిచేస్తుంటాడు హీరో రవితేజ. ప్రకాష్ రాజ్ రూపొందించిన నగల ప్రకటన అందరూ బాగుందంటారు కానీ రవితేజ నాకు నచ్చలేదంటాడు. ఎందుకంటే ఆ ప్రకటనలో పెళ్లిచూపుల్లో మొదట అమ్మాయి నగలు వేసుకొని ఉండదు కాబట్టి అబ్బాయికి నచ్చలేదు, ఆ తర్వాత ఫలానా జువెలరీ వాళ్ల నగలు వేసుకోగానే అమ్మాయి నచ్చడం సారాంశం. "నగలకు తప్ప అమ్మాయికి విలువ లేదా" అని రవితేజ వాదన. ఇలాంటి ప్రకటనలు మనం చాలా చూస్తున్నాం. ఫెయిర్ అండ్ లవ్లీ ప్రకటన, చక్రగోల్డ్ టీ ప్రకటన (ఇది మరీ దారుణం. టీ పొడి కూడా పుట్టింటి నుంచి తెచ్చి, ఇంటిల్లిపాదికీ కొత్త కోడలు సంతృప్తికరంగా టీ చేసినట్టు చెబుతుంది) '........' చెబుతూ పోతే చాలా ఉన్నాయి. ఇవి కాక జుగుప్సాకరంగా మగవాళ్లు వాడే రేజర్లు, అండర్వేర్లు, పెర్ఫ్యూములకు కూడా మహిళలను అశ్లీలంగా చూపించి వ్యాపారం పెంచుకునే ప్రకటనలే. చివరికి జీవిత భీమా సంస్థ సైతం పొదుపెందుకంటే అమ్మాయి పెళ్లికి, అబ్బాయి చదువుకు అన్నట్లు ప్రకటన రూపొందించింది. కాని ఇటీవల కొన్ని వాణిజ్య ప్రకటనలలో ఓ మంచి సానుకూల పరిణామం కనబడుతోంది. బహుశా యాడ్ ఏజెన్సీలో క్రియేటివ్ హెడ్స్ గా మహిళలు (అందునా అభ్యుదయ భావజాలం ఉన్న చైతన్య పింగళి వంటి మహిళలు) ప్రవేశించిన ఓ కారణం కావచ్చు. "వినియోగదారీ సంస్కృతికి సమాజంలో వస్తున్న నూతన భావజాలాన్ని ఉపయోగించడం కావచ్చు" రెడ్ లేబిల్ టీ ప్రకటనలు ఈ మధ్య చూస్తే చాలా ఆలోచింపజేసేవిగా ఉంటున్నాయి. మతాంతర వివాహాలు, సహజీవనం, ట్రాన్స్ జండర్, కరోనా బాధితులు ఇలాంటి అన్ని అంశాల పట్ల సానుకూల ధోరణితో రూపొందించినట్లు ప్రకటనలు కనబడటం ఆహ్వానించదగ్గ పరిణామం.




అలాంటి ప్రకటనే ఇటీవల తనిష్క్ ఆభరణాలకు కూడా వచ్చింది. అందులో గర్భవతైన హిందూ కోడలికి, ముస్లిం అత్తగారు హిందూ సంప్రదాయం ప్రకారం శ్రీమంతం జరిపిస్తూ తనిష్క్ ఆభరణాలను బహూకరిస్తుంది. ఈ ప్రకటన చూసిన హిందుత్వ శక్తులకు భయమేసింది. ముస్లిం యువకులు హిందూ యువతులను వివాహాలు చేసుకొనటాన్ని- లవ్‌జీహాద్ ను ప్రోత్సహించేదిగా, ఉగ్రవాదులకు మద్దతు ఇచ్చేదిగా ఈ ప్రకటన ఉందని వారికీ అభ్యంతరం. కొందరు ఆర్‌ఎస్‌ఎస్ నెటిజన్లు సామాజిక మాధ్యమంలో దాడికి దిగితే గాంధీ ధామం, ముంబై తనిష్క్ దుకాణాల వద్ద మరికొందరు దాడులు చేశారు.

అయితే తనిష్క్‌కు అడ్వర్టయిజింగ్ కంపెనీలు, అనేక సంస్థలు మద్దతుగా నిలిచాయి. భారత ప్రకటనల ప్రమాణాల మండలి (ఎఎస్‌సిఐ) కూడా ఒక ప్రకటన చేస్తూ తనిష్క్ ప్రకటన ఏ ప్రమాణాలనూ ఉల్లంఘించనందున దాని మీద చేస్తున్న ఫిర్యాదులు నిలిచేవి కాదని, కావాలనుకుంటే ప్రకటనదారులు ప్రసారం చేసుకోవచ్చని పేర్కొన్నది. కానీ తనిష్క్ తన ప్రకటనను వెనక్కు తీసుకుంది. ఇదంత మంచి పరిణామం కాదని, తనిష్క్ ప్రకటనను ఆపేయాల్సింది కాదని చాలా మంది అభిప్రాయపడ్డారు. మతోన్మాదులు ఇలా తెగబడటం ఇదే మొదటిసారి కాదు. అలాంటివి గతంలో కూడా జరిగాయి.

రంగుపడుద్ది.. హిందూస్తాన్ లీవర్ కంపెనీ ఉత్పత్తి సర్ఫ్ ఎక్సెల్ పౌడర్ ప్రకటన గుర్తుందా మీకు? అందులో హోలీ సందర్భంలో హిందూ బాలిక ముస్లిం స్నేహితుడితో "నువ్వు నమాజుకు వెళ్లిరా... తరువాత రంగు పడుతుంది" అని అంటుంది. హోలీ పండుగ

కంటే సమాజుకు ప్రాధాన్యత ఇచ్చారంటూ మతోన్మాదులు దాడి చేశారు. ఇదే కంపెనీ తన రెడ్ లేబుల్ టీ పొడి ప్రకటనకు కుంభమేళాను ఇతివత్తంగా ఎంచుకుంది. వృద్ధుడైన తన తండ్రితో మేళాకు వెళ్లిన కొడుకు నుంచి జనం రద్దీలో తండ్రి విడిపోతాడు. కొడుకు తండ్రిని వెతుక్కుంటూ వెళ్లి ఒక టీ స్టాల్ దగ్గర తండ్రిని కలుసుకుంటాడు. ఇద్దరూ టీ తాగుతూ ముసలి వారిని వదిలించుకొనే చోట నాకోసం తిరిగి వచ్చావంటూ కొడుకును తండ్రి అభినందిస్తాడు. దీని మీద "హిందువులు పవిత్రంగా భావించే కుంభమేళాను కించపరుస్తారా... బహిష్కరించండి హిందుస్తాన్ లీవర్ కంపెనీ ఉత్పత్తులను" అంటూ సామాజిక మాధ్యమాల్లో దాడికి దిగారు. దాని మీద ఆ కంపెనీ తన ప్రకటనను సమర్థించుకుంది. ముసలి వారిని వదిలించుకొనేవాటిలో కుంభమేళా స్థలం ఒకటి. మన పెద్దవారి సంరక్షణ పట్టించుకోకపోవటం విచారకరం కాదా? అలాంటి చోట్ల చేతులు పట్టుకొని పెద్దవారిని తీసుకు పోవాలని ప్రోత్సహించే లక్ష్యంతోనే ఆ ప్రకటన రూపొందించామని, ఆ ప్రకటన చూడండి ఒక నగ్నసత్యం గురించి కళ్లు తెరిపిస్తుంది అని పేర్కొన్నది. దానికి విపరీతార్థం తీసి హిందువుల మనోభావాలను రెచ్చగొట్టేందుకు ప్రయత్నించారంటూ రాద్ధాంతం చేశారు. ఉత్తరాదిలో కుంభమేళా సందర్భంగా కొందరు కావాలనే ముసలివారిని వదలి వేసి తమదారి తాము చూసుకుంటారన్నది నమ్మలేని నిజం. మేళా ముగిసిన తరువాత అలాంటి వారందరినీ వృద్ధాశ్రమాలకు తరలిస్తారు. ఆ దుర్మార్గాన్ని ఖండించి, నిరసించాల్సింది పోయి ఒక సందేశాత్మక అంశంతో రూపొందించిన ప్రకటనకు మతానికి ముడి పెట్టటం దేశంలో మతోన్మాద భావనలను ఎంతగా మెదళ్లకు ఎక్కించారో స్పష్టం చేస్తున్నది.

కుంభమేళాలో ఇలాంటి దురాచారం, కొందరు బిడ్డల బాధ్యతా రాహిత్యం గురించి 2013 ఫిబ్రవరిలో నేషనల్ జాగ్రఫిక్ న్యూస్ ఒక కథనాన్ని ప్రచురించింది. తమ కుటుంబాల్లోని ముసలి వారిని వదిలించుకొనేందుకు కుంభమేళా కోసం ఎదురు చూసే వారు కూడా ఉంటారని అనుష్ మాలవ్య అనే ఒక సామాజిక కార్యకర్త చెప్పిన అంశాన్ని దానిలో పేర్కొన్నారు. వదలివేసినట్లు ఎవరూ అంగీకరించరు గానీ అది వాస్తవం అని అనుష్ చెప్పారు. అలా విస్మరణకు గురైన వారిలో తాము ఎక్కడి నుంచి వచ్చామో కూడా తెలియని వారు ఉంటారని, కొందరు వృద్ధాశ్రమాల్లో చేరితే మిగిలిన వారు వీధులపాలై యాచకులుగా మారతారని చెప్పారు. వారణాసి, బృందావన్ ప్రాంతాల్లో వితంతు మహిళలను వదలివేసే దురాచారం ఇప్పటికీ కొనసాగుతున్న విషయం తెలిసిందే. ఏ పురాణం లేదా వేదాలు కూడా అనాథలైన వారిని ఇలా విస్మరించమని చెప్పలేదు.

తనిష్క్ జ్యువెలరీ యాడ్ లో తప్పు చూడటం, మరోకోణంలో ఎందుకు ఇంకో యాడ్ చేయలేదూ అని అడగటం మనలో పేరుకుపోయిన స్త్రీ వివక్షని చూపుకోవడమే. ఆడవారంటే మనకు ఒక పరువు, ఒక ఆస్తి, గౌరవప్రతిష్టలకు చిహ్నం అనే భావనని నరనరాల్లో ఇంకించేసుకున్నాం కాబట్టే ఆ యాడ్ లోని హిందూ ముస్లిం మతసామరస్యంలోకూడా తప్పుని చూడగలుగుతున్నాం. ఆ యాడ్ లో మనం ఏ తప్పుని వెదుకుతున్నాం..? అభ్యంతరకరంగానో, అశ్లీలంగానో ఆ ప్రకటన రూపొందలేదు కదా. మరో వాదన ఏమంటే అదే ముస్లిం అమ్మాయి, హిందూ అబ్బాయిని చేసుకున్నట్టు చూపించవచ్చు కదా అని. కావచ్చు. బహుశా ముందు ముందు అలాంటివి కూడా రావచ్చు అని ఆశిద్దాం. ఏమైనా అమ్మాయంటే ఇంటి పరువు అని, ఆమెకు తన భాగస్వామి ఎంపిక గురించి నిర్ణయాధికారం లేదని తీర్మానించడం సరైనదేనా?

## ఆలోచిద్దామా?

**తనిష్క్ ప్రకటన - దాడులు - పరిణామాల నేపథ్యంలో కొన్ని ప్రశ్నలు:**

1. వివాహం అనేది వ్యక్తిగతం, దాన్ని లవ్ జీహాద్ పేరుతో మతంతో ముడిపెట్టడం సరైనదా?
2. లౌకిక రాజ్య భావనకు విఘాతం కల్పించేలా ఈ దాడులు జరగడం కరెక్టేనా?
3. వివాహం తదితర అంశాలకు సంబంధించి, మహిళల నిర్ణయాధికారాన్ని మతం నిరాకరించడమే కదా?
4. సృజనాత్మక రంగంలో భావ ప్రకటన స్వేచ్ఛను దెబ్బతీసేవిధంగా ఉన్మాదంగా దాడులు చేయడం తగునా?
5. ఇక చివరిది, ఇలాంటి హేయమైన చర్యలను నిరసించకుండా పౌరులు, మేధావులు మౌనంగా ఉండటం ఏ వ్యవస్థ కైనా మంచిదేనా? మౌనం వీడండి, మాట్లాడండి.

# పెళ్లి ముచ్చట్లు!



పంతులు గారికి ఆహ్వానం అందినా సహపంక్తి భోజనమునకు దక్షిణేతర బ్రాహ్మణుడు చేసిన వంట పంతులు గారికి సరిపడలేదు. అలా రెండుమూడు సార్లు పంతులుగారికి సహపంక్తి భోజనము సరిపడలేదు. మరల ఇంటికి వచ్చి భోజనము చేసేవారు. మరోసారి ఆహ్వానం వచ్చినప్పుడు సహపంక్తి భోజనము యొక్క ఆశయము ఏమిటని వారినడుగుగా అన్ని కులముల వారు కలిసి భుజించుట అని వారు చెప్పారు. మరి ఈ కార్యక్రమంలో పాల్గొనే వారి పేర్లు పత్రికల్లో ప్రకటించుచున్నారా అని అడిగితే పేర్లు ప్రకటిస్తే భోజనములు ఆగిపోతాయని వారు బదులు చెప్పారు. పేర్లు వెల్లడి చేయకుండా కార్యక్రమం జయప్రదంగా జరిగిందని ప్రకటించుకోవడం ఇతరులను మోసం చేయడమే అని తన అభిప్రాయాన్ని చెప్పారు. ఆ తరువాత నుండి ఆ కార్యక్రమములకు పంతులుగారికి పిలుపు లేదు. పత్రికల్లో వార్తలు లేవు.

చెన్నపట్నంలోనే సంఘసంస్కరణ సంఘం వారు వితంతు శరణాలయము స్థాపించుటకు ముందుకువచ్చి శరణాలయానికి తగిన ఇల్లు కొనుగోలు చేయుటకు ఎస్‌కె రామస్వామి అయ్యంగారు పెట్టుబడి పెడతానని ఓ సభలో చెప్పారు. చందాలు వసూళ్లు చేయుట, ఇంటి పని మొదలు పెట్టుట, ఇంటిని కొనే పని అయ్యంగారి వద్ద వడ్డీకి డబ్బు అప్పు తెచ్చుట మొదలగు పనులన్నీ పంతులుగారికి అప్పగించారు. ఆ వీధిలోనే ఇల్లు బేరం చేసి రూ.3800 ధర ఖరారు చేసి పంతులుగారి ఇంటి పత్రములను తన వద్ద వుంచుకున్నారు. రామస్వామి అయ్యంగారిని అప్పు

> **వితంతు శరణాలయము పంతులుగారు తన ఇంట్లోనే ప్రారంభించారు. ముగ్గురు నలుగురు వితంతువులు పంతులుగారి ఇంట్లోనే ఉండేవారు. వారి పుస్తకములకు, చదువుకు, వస్త్రములకు, భోజనమునకు, వైద్యమునకు ఖర్చు పంతులుగారిదే. వారి ఇంటిలో పది వితంతు వివాహాలు జరిపారు.**

గురించి అడుగగా అది తన ఒక్కడిదీ కాదని తన తమ్ముడు భాగస్వామి కనుక తను రుణము ఇవ్వలేనని చెప్పారు. ఇల్లు అమ్మేవాళ్లు ఏదైనా సమస్య వచ్చి ఒక వేళ కోర్టుకెక్కితే సంవత్సర కాలం పడుతుందని అప్పుడు సంగతి అప్పుడు చూసుకోవచ్చునని సలహా ఇచ్చారు. పంతులుగారు తన ఇల్లు తాకట్టుపెట్టుకుని సొమ్ము ఇవ్వవలసిందిగా కోరారు. పంతులుగారు ఆ ఇంటి న్యాయవాదితో మాట్లాడి ప్రస్తుతం రూ.500 అడ్వాన్స్ ఇచ్చి మిగతా మొత్తం మూడు నెలల్లో ఇచ్చుటకు, ఇవ్వలేకపోతే ఇచ్చిన రూ.500 వదులుకుందుకు ఒప్పందం చేసుకొని రూ.3300 చెల్లించుటకు పంతులుగారు ప్రయత్నాలు మొదలు పెట్టారు.

చెన్న పట్నంలో బుచ్చయ్య పంతులుగారు, దుగ్గిరాల ప్రకాశరావు గారు, న్యాపతి సుబ్బారావు గారు రూ.500 చొప్పున, డా॥ సి.డి రామారావు రూ.400 బదులిచ్చారు. పంతులుగారి దగ్గర చదువుకున్న పోలవరపు జమీందార్ గారు వెయ్యి రూపాయలు ఇచ్చి ఇది విరాళము అని ఉత్తరం రాశారు. అంతేకాక పంతులుగారి ఆయిల్ పెయింట్ చిత్ర పటము రాజమహేంద్రవర పురమందున బహుమానముగా ఇచ్చారు. **వితంతు శరణాలయము పంతులుగారు తన ఇంట్లోనే ప్రారంభించారు. ముగ్గురు నలుగురు వితంతువులు పంతులుగారి ఇంట్లోనే ఉండేవారు. వారి పుస్తకములకు, చదువుకు, వస్త్రములకు, భోజనమునకు, వైద్యమునకు ఖర్చు పంతులుగారిదే. వారి ఇంటిలో పది వితంతు వివాహాలు జరిపారు.** మూడవ వితంతు వివాహము అయిన స్త్రీ పేరు శ్రీమహాలక్ష్మమ్మ. ఆమె కాకినాడ నుంచి వచ్చింది.

ఆమె రెండు సంవత్సరాలు పంతులుగారి ఇంటిలో ఉన్నది. ఆమెకు 20 సం॥లు. చదువు, అందము, ధైర్యము కలిగిన యువతి. ఆమె పంతులుగారి వద్దకు రాకపూర్వపు నడవడికను గురించి పంతులుగారు కొన్ని అపవాదులు విని వున్నారు. కానీ ఆమె పంతులుగారి వద్ద సత్ప్రవర్తనతోటే ఉండేది.

పట్టభద్రుడినే వివాహమాడుతానని ఆమె కోరడం వల్ల పట్టభద్రుడైన, భార్య చనిపోయిన ఒక వ్యక్తి ఆమెను పెళ్లాడడానికి ముందుకొచ్చాడు. పెళ్లి నిశ్చయమయ్యాక పంతులుగారికి కొన్ని కొత్త సంగతులు తెలిసి వరునితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు.

వరుడే వివాహం విరమించుకున్నట్లు పంతులుగారికి ఉత్తరం రాశారు. పెళ్లి ఆగిపోయింది. న్యాపతి సుబ్బారావుగారి తమ్ముడు శేషగిరిరావు పంతులుగారి వద్దకు వచ్చి తాను వితంతు వివాహం చేసుకుంటానని చెప్పాడు. అతనికి భార్య చనిపోయింది. పంతులుగారు శ్రీమహాలక్ష్మమ్మ వివరములన్నీ చెప్పారు. వధువరులు వివాహమునకు అంగీకరించారు.

మహాసముద్రం దేవకి



# మూఢత్వం వదిలెయ్!



'కళ్యాణ మంటపంలో ఖర్చే 18 లక్షలంటా. పది లక్షలు అడ్వాన్సు కూడా కట్టేసినాడు.' 'నగలకు రెండు కోట్లంటా వొదినా' 'ఏం రెండు కోట్లు, వడ్డానం, పూల జడతో గుడా వొజ్రాలే . ఏడెనిమిది కోట్లు అంటుంటే 'నవరత్నాల సెట్టంటా, పచ్చలు, కెంపులు, ముత్యాలు, పుష్యరాగాలు ఇంగా ఏమేమో పేర్లు గుర్తుండి సస్తే గదా! అన్నీ సెట్లు సెట్లుగా మద్రాస్ కు బొయ్యి తెచ్చుకున్నారంటా. 'అవేనా ? వెండి సామాన్లు , పట్టు చీరలు , పెట్టుడు బట్టలు , మేకప్ కిట్టులు ఐద్దినాలు ఆడే సరిపొయ్యిందంటా. 'జుట్టున్నాయమ్మ ఎన్ని తీరుల కొప్పులైనా పెట్టుంది. కోట్లు మూలగతా ఉంటే దర్జాలకు తక్కువా?' ఏమాట కామాటే చెప్పు కోవాల అంతుందన్న గర్వం మాత్రం ఏ కోశానా కనిపించదు' 'దాన ధర్మాలు చెయ్యడంలో కూడా ఆయన్న ముందుటాడులే ' టైలర్లిద్దురూ, జాకిట్లకి డిజైన్ కుట్టే వాళ్లు ఏడెనిమిది మంది దాకా ఇంట్లోనే పద్దినాలుగా కుడతా ఉండారంటా' ' వచ్చినోళ్లకు దినాము మూడు పూట్లా వొండి వొడ్డించే వాళ్లు, ఇంట్లో పని చేసే వాళ్లు, పందిళ్లేసే వాళ్లు ఏమని పెండ్లను కున్నారో ఊర్లో సాయం జేసే అయ్యలు అమ్మలక్కలతో కూడా ఒక దినానికి నూరు నూట యాభై ఇస్తళ్లు ఎంగిలవుతాయంటా' ' అందర్నీ ఆదరిస్తాడు. అందుకే అడగ కున్నా అన్ని పనులు ఐపోతాయి. పిలవక పోయినా ఒచ్చి పనందు కుంటారు " కష్ట పడినాడు. సంపాదించినాడు. ఇప్పుడు మంచి నీళ్లు మాదిరిగా సెలవు పెడతా ఉండాడు' ఎవురి నోట్లో చూసినా ఇలాంటి మాటలే .

రేపు పెళ్లి కూతుర్ని చేస్తున్నారు. అవధులు లేని ఆనందం ఆ ఇంటి నట్టింట నాట్యమాడు తోంది. పెళ్లి కొచ్చిన బంధు మిత్రులకు బాక్సుల్లో పార్సెల్ చేసి ఇవ్వడానికి అయిదు రకాల స్వీట్లు సిద్ధం చేశారు. పాత చావిటింట్లో కూర్చొని ఊర్లోని అమ్మలక్కలు ఓ ఆరు మంది కబుర్లు చెప్పుకుంటూ ఆ పని కానిస్తున్నారు. పెళ్లి కూతురు సుస్మిత , ఆమె పెద్దమ్మ కోడలు అంటే సుస్మితకు వదిన వరసైన నీలాంబరి, ఇంకో పెద్దమ్మ కూతురు ఐశ్వర్య , నాన్నకు చిన్న తమ్ముడి కూతురైన సుస్మితకు అక్క సురేఖ , సుస్మిత స్నేహితురాళ్లు అంతా బెడ్ రూంలో చేరారు. వాళ్ల సలహాతో పెళ్లికి కట్టు కొనే పట్టు చీరలు, బ్లవుజులు, కల్యాణ మంటపంలో స్నానం చేశాక ఆ రాత్రి వేసుకొనే నైట్ డ్రస్సులతో సహా అన్ని మంచం పైన వేసింది నీలాంబరి. మర్నాడు పెళ్లి కూతుర్ని చేసేటప్పుడు, నలుగుకు, ఆ తర్వాత కట్టు కొనే చీరలకు సరి పోయే నగల సెట్లు పక్కకు తీసి ఒక అరలో సర్ది పెట్టింది సురేఖ. కల్యాణ మంటపానికి తీసుకు పోయే పెద్ద సూట్కేసును మంచం పైన పెట్టారు. రాత్రి వక్కాకు శాస్త్రం మొదలు పెళ్లయ్యాక కాణిపాకం, ఆ తర్వాత తిరుమలకు వెళ్లి వచ్చే దాకా కావలసిన బట్టలు, నగలు , మేకప్ కిట్ దాకా అందరూ కలిసి సూట్ కేస్ లో సర్ది జాగ్రత్తగా తాళం వేసి ఆ తాళాలను అందరికంటే పెద్దదయిన నీలాంబరికి అప్ప జెప్పారు. భోజనాలకు పిలుపు వచ్చింది. వెళ్దామని లేస్తుండగా సుస్మిత ఫోన్ రింగయింది. అవతల ఫోన్లో అవినాష్ . ఇంక అయినట్లే అనుకుంటూ అందరూ గది బయట లాంజ్లో ఉన్న సోఫాల్లో కొలువు తీరారు. పది నిముషాలకు గాని సుస్మిత గది వదిలి రాలేదు . అందరూ కబుర్లు చెప్పుకొంటూ భోజనాలు కానిచ్చారు . రవి , విజయల ముద్దుల కూతురు సుస్మిత . తర్వాత పుట్టిన వాడు సురేష్. వాళ్లది ఒకప్పుడు మధ్య తరగతి వ్యవసాయ కుటుంబం. సుస్మిత పుట్టిన తర్వాత రవి ఏ పని చేసినా పట్టిందల్లా బంగారమవుతూ వచ్చింది. రోడ్డుకు ఫర్లాంగ్ దూరంలో ఉంటుంది వాళ్ల ఊరు . బెంగులూరు చెన్నై హైవేలో.

రవి వాళ్లకు వరి, చెరకు పండే పొలాలు, ఊరి కానుకొని ఉన్నాయి. శెనిక్కాయిలు పండే చేన్లు మాత్రం రోడ్డు కానుకొని ఉన్నాయి. మెట్ట చేన్లే

అయినా అవే బంగారం గుడ్లు పెట్టే బాతులని నిర్ణయించు కున్నాడు రవి. బాతులు గుర్తుకు రాగానే కోళ్ల ఫారం పెట్టాలన్న ఆలోచన వచ్చింది రవికి. చేన్లో బోరు వేస్తే నీళ్లు బాగా పడ్డాయి. అదొక శుభ శకునంగా భావించాడు. మొదట రెండు వేల కోళ్లతో మొదలైన వ్యాపారం రెండు మూడేండ్ల లోనే లక్షకు పైగా విస్తరించింది. మంచి లాభాలతో కోట్లకు పడగెత్తాడు. సుస్మిత బీ. టెక్ పూర్తయినాక అమెరికా వెళ్లి ఎం .టెక్ పూర్తి చేసింది. అక్కడే యాపిల్ కంపెనీలో ఉద్యోగం కూడా వచ్చింది. తనకు పెండ్లి చెయ్యాలని చూస్తున్నారన్న విషయాన్ని ముందు తల్లి ద్వారా వినింది సుస్మిత. ఏమాత్రం భయ పడకుండా తాను తన క్లాస్ మేట్ అవినాష్ ను ప్రేమించానని . అతను తెలుగు వాడేనని ,కడప జిల్లా లోని రాయచోటి అతని సొంత ఊరని చెప్పింది. అతని ఫోటోలు మిగిలిన వివరాలు తండ్రి వాట్సాప్ లో పెట్టింది. అందగాడు, ఉన్న వాడు, చదువులో , ఉద్యోగంలో అన్నిట్లో తన కూతురికి సరి తూగే వాడని తెలిశాక అభ్యంతరం చెప్ప లేదు రవి. కార్తిక మాసంలో మంచి మూహూర్తా లున్నాయని పంతులు గారు చెప్పడంతో ఇరు వైపుల పెద్దలూ కలిసి ముహూర్తం నిర్ణయించారు. వాళ్లిద్దరిని సెలవు పెట్టి రమ్మన్నారు.

ఒకే ఫ్లైట్లో వచ్చిన కాబోయే వధూవరులను చెన్నై లో రిసీవ్ చేసుకున్న ఇరు కుంటుంబాల వాళ్లు అక్కడే నాలుగు రోజులుండి షాపింగ్ కూడా ముగించు కొని ఎవరి ఊర్లకు వాళ్లు వెళ్ళి పోయారు. పెళ్లి రోజు రానే వచ్చింది. రేపే ముహూర్తం. ఈ రోజు సుస్మితను పెళ్లి కూతుర్ని చేస్తారు. ఉదయమే అందరూ లేచారు. రాత్రి చాలా సేపు మేల్కోవడం వల్ల ఎన్ని సార్లు లేపినా లేవడం లేదు కొంత మంది పిల్లలు. బాత్ రూంలు ఖాళీగా కనిపిస్తే చాలు నిద్ర పోతున్న వాళ్లను బలవంతంగా దుప్పట్లు లాగి స్నానాలకు సిద్ధం చేస్తున్నారు తల్లులు. వంట వాళ్లు ఓ ఐదు వందల మందికి సరి పడా కేసరి, పొంగలి, ఇడ్లీ, చట్నీ, సాంబారు, ఉద్ది వడలు చేశారు. ఒక వైపు మధ్యానం



వంటకు కొంత మంది కూచొని కబుర్లు చెప్పుకుంటూ కూరగాయలు తరుగుతున్నారు. సాంబారుకు, రసానికి పెద్ద పెద్ద డేక్సాలలో కంది పప్పు కుత కుత ఉడుకుతోంది . గ్రైండర్లో పోలీల కొసం ఇద్దరు వ్యక్తులు పూర్ణం సిద్ధం చేస్తున్నారు. వాకిట్లో పెళ్లి కూతుర్ని చెయ్యడం కోసం పచ్చని టెంకాయాకుల కీతులతో వేసిన పందిరిని పూలతో అలంకరిస్తున్నారు కొందరు.

చాలా మంది ఫోన్లు ఒక్కసారిగా రింగ్ కావడం మొదలయింది. మాట్లాడిన వాళ్ల మోహాలు ఆందోళనతో భయంకరంగా మారిపోతున్నాయి. ఫోన్లో మాట్లాడిన వాళ్లు పక్కనున్న వాళ్లకు వార్తనందించి ఇలాంటి సమయంలో ఇలా జరిగిందేమిటి అని కళ్ల నీళ్లు కమ్ముకొస్తుంటే ఆశ్చర్య పోతున్నారు. బైకుల్లో ఒకేసారి ఐదారు మంది వచ్చి ఇంటి ముందు దిగారు. అందరూ వాళ్లను చుట్టు ముట్టారు. రవి చిన్నాన్న కొడుకు అప్పటికే విషయం తెలిసి నట్టింట్లో కూలబడి బిత్తర చూపులు చూస్తున్న రవి భార్య విజయను రెక్క బట్టి లేపాడు. కార్లో కూర్చోబెట్టాడు. గబగబా మరో నలుగురు అదే కార్లో ఇరుక్కొని కూచున్నారు. మీరూ వచ్చేయండి అని సుస్మితా వాళ్లనుద్దేశించి అన్నాడు. వాయు వేగంతో కారు చిత్తూరు వైపు దూసుకు పోతోంది. సుస్మిత, ఆమెతో పాటు ఉన్న వాళ్లు కూడా కార్లలో బయలుదేరి పోయారు. నిముషాల్లో వార్త చుట్టు పక్కల ఊర్లంతా పాకి పోయింది. సానుభూతి మాటల్లో అట్టహాసంగా చేసిన పెళ్లి ఏర్పాట్లు కూడా బాధగా అందరి నోళ్లలో నానుతున్నాయి. ఉదయం పందిరిని అలంకరిస్తున్న వాళ్లు చూట్టూ వెదురు కూసాలకు కట్టడానికి కావలసిన అరటి చెట్ల గురించి రవికి గుర్తు చేశారు. నేనెలాగు అటు వైపు వెళ్తున్నాను . ఎవరితోనైనా పంపిస్తానని బైకు మీద బయలు దేరాడు రవి. కట్ట మీది నుంచి వెళ్తే రెండు ఫర్లాంగుల దూరమవుతుంది. అది చుట్టు దారి. అందుకని కట్ట మీది నుంచి కాకుండా అడ్డ దారిలో చెర్లో నుంచి వచ్చి రోడ్డెక్కాడు. అంతే క్షణాల్లో ఎడమ వైపు నుంచి వస్తున్న లారీ బైకును గుద్దడం రవి ఎగిరి పోయి చెర్లో పడ్డం జరిగి పోయింది. లారీ వాడు ఆపకుండా స్పీడుగా వెళ్లి పోయాడు. పక్కపల్లె నుంచి చెరువు కట్ట మిందా కూరగాయల గంపలతో నడిచి వస్తున్న ఇద్దరు ఆడవాళ్లు చూసి భయంతో కేకలు వేశారు. క్షణాల్లో జనం చుట్టు ముట్టారు. రవి చెర్లో ఉన్న రాయి మీద పడడంతో తలకు పెద్ద గాయమైంది. రోడ్లో వస్తున్న కారును ఆపి రవిని ఎత్తి సీట్లో పడుకో బెట్టారు. ముందుగా ప్రయివేట్ డాక్టర్ దొరస్వామి రాజు దగ్గరికి తీసుకెళ్లారు. అతను రక్తం ఎక్కువ పోవడం చూసి ముందు పోలీస్ కంప్లైంట్ ఇవ్వాలని, వాళ్ల అనుమతి లేకుండా యాక్సిడెంట్ కేసు

టేకప్ చెయ్యరాదని చెప్పి ధర్మాసుపత్రికి తీసుకెళ్లమని సలహా ఇచ్చాడు. సీరియస్ గా ఉండడంతో వాళ్లు అడ్మిట్ చేసుకోలేదు. ఫస్టైడ్ చేసి అంబులెన్స్ ఇచ్చి వేలూరుకు తీసుకు పొమ్మన్నారు. రాయ వేలూరు సి. ఎం.సి హాస్పిటల్లో ఎమర్జెన్సీ వార్డులో అడ్మిట్ చేసుకున్నాక అందరూ ఇక భయం లేదనుకున్నారు. చుట్టు పక్కల ఊర్లలో వాళ్లు కూడా తెలిసిన వాళ్లు తెలిసినట్లే రవిని చూడటానికి వేలూరు వెళ్లి చూసి వస్తున్నారు. ఎవరినడిగినా ఇంకా స్పృహలోకి రాలేదంటున్నారు.

సాయంకాలం నాలుగవుతుండగా రవి ఈ లోకం వదిలి వెళ్లి పోయాడన్న వార్త చుట్టు పక్కల ఊర్లలోనూ గుప్పు మంది. విజయ హాస్పెటల్లోనే స్పృహతప్పి పడి పోయింది. కూతురు సుస్మిత కూడా చలనం లేకుండా నేల కంటక పోయింది. ఆ విషయాలతో పాటు అట్టహాసంగా ఏర్పాటు చేసిన పెళ్లి విశేషాలనూ చెప్పు కొని జనం కన్నీరు పెట్టుకొంటున్నారు. పెళ్లి కొడుకు వాళ్లకు యాక్సిడెంట్ అయిందని తెలిసిన వెంటనే ఆ రోజు పెళ్లి కొడుకును తీసుకొని రావలసిన వాళ్లు ఉన్న పళంగా ఆగ మేఘాల మీద వచ్చి మధ్యానానికంతా హాస్పెటల్లో వాలి పోయారు. రేపు ఉదయానికి గానీ శవం ఇంటికి రాదని తెలిసింది. స్పృహ లేకుండా పడి ఉన్న విజయను డాక్టర్ కు చూపించి తేరుకున్నాక బలవంతంగా కారులో ఇంటికి చేర్చారు . ఆ రాత్రంతా ఇంట్లో ఉన్న వాళ్లకే కాదు, ఊర్లో వాళ్లకు కూడా ఎవరికీ కంటి మీద కునుకు లేదు. తెల్లవారకుండానే చుట్టుపక్కల ఊర్లలో ఉన్న వాళ్లు ఇంకా పెళ్లిల్లు చేరని బంధువులు రావడం మొదలయింది. ఒక్కొక్కరు వచ్చినప్పుడంత ఏడుపులు మిన్ను ముట్టి ఇల్లంతా ఆలగోడు బాలగోడుగా ఉంది. పరామర్శకు వచ్చిన వాళ్లు పెద్ద ఏడుపు అయిపోయాక ఎక్కడో ఒకచోట సర్దుకు కూర్చొని మాటల్లో మునిగి తేలుతున్నారు. మళ్లీ ఎవరో ఒకరు వచ్చి విజయను , సుస్మితను, సురేష్ ను పట్టుకొని ఏడుస్తున్నారు. వాళ్లతో పాటు ఇంకొంతమంది కూడా గొంతు పెంచి ఏడుస్తున్నారు. ఆ తర్వాత కొంత సేపటికి నిశ్శబ్దం ఆవరించినా చని పోయిన రవి గురించి ఎవరో ఒకరు ఏదో ఒకటి గుర్తు చెయ్యడం , దాంతో ఉండుండీ ఏడుపులు తూడుపులతో గగ్గోలు కావడం, అంతా ఒక ప్రహసనంలా సాగుతోంది. అవినాష్ తల్లిదండ్రులు ఏడుస్తున్న విజయను, సుస్మితను ఉండుండి ఓదారుస్తూనే ఉన్నారు. కొంత సేపటికి బయటి నుంచి వచ్చి అవినాష్ మెల్లగా సుస్మిత పక్క చేరాడు. అక్కడే అక్క పక్కన కూర్చొని ఏడుస్తున్న సురేష్ ను ముందు అక్కున చేర్చుకున్నాడు. సుస్మిత కుమిలి కుమిలి ఏడుస్తోంది . ఓదార్పుగా అవినాష్ ఆమె తలను తన ఒళ్లో పెట్టుకొన్నాడు. అది చూసి కొంత మంది గొల్లుమన్నారు. మరి రేపు ఉదయానికి భార్యా భర్తలు కావలిసిన వాళ్లు. సుస్మితను ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు అవినాష్ కు. తలపై నిమురుతూ మౌనంగా ఉండిపోయాడు .' పెళ్లి ఈ పొద్దు కాకుంటే రేపు అవుతుంది. పోయిన ప్రాణం తిరిగి రాదు కదా! ఇంకొన్నాళ్లకు పెండ్లి చేసుకున్నా ఏం సంతోష ముంటాది వీళ్లకు. జీవితాంతం ఈ పొద్దు జరిగింది గుర్తొచ్చి ఆ బిడ్డ సంతోసంగా ఉండ నిస్తాదా? ఆ పెళ్లి. ' సానుభూతిని వ్యక్తం చేస్తూనే వాస్తవాన్ని గుర్తు చేసింది మంగమ్మ .

ఆమె రవి తమ్ముడు రాజుకు పిల్ల నిచ్చిన అత్తగారు. అంతే ఆ మాటలకు గట్టిగా ఏడుస్తూ అవినాష్ ఒడిలోనుంచి లేచి కూర్చొని బిత్తర చూపులు చూడ సాగింది సుస్మిత. అందరి కళ్లూ వాళ్లిద్దరి మీదే ఉన్నాయి. ఆడంబరంగా చేస్తున్న పెళ్లి ఏర్పాట్లను చూసి కళ్లల్లో కారం పోసుకున్న వాళ్లే ఎక్కువ. వాళ్లలో మంగమ్మదే మొదటి స్థానం . అప్పుడు కడుపులో పండ్లు పెట్టుకొని పెదవులపై తేనె పులుముకొని బాగానే మాట్లాడింది. ఇప్పుడు పైకి సానుభూతిని వ్యక్తం చేస్తూ వాళ్ల పెళ్లిని చెడగొట్టే ప్రయత్నాన్ని ముమ్మరంగా సాగిస్తోంది. అవినాష్ సుస్మితను ఆదరిస్తున్న తీరు చూసి ఓర్వలేకపోయింది మంగమ్మ. పక్కనున్న వాళ్లతో గుస గుస లాడ సాగింది.

'గొడ్డొచ్చిన వేళ బిడ్డొచ్చిన వేళ అంటారు. కాబోయే అల్లుడైనా సరే. శుభం జరగాలి గాని అశుభం జరగడం మంచిది కాదు. మళ్లీ ఈ సంబంధాన్ని ఏం మంచి జరిగిందని చేసుకుంటారూ ? అని దీర్ఘం తీసింది. ' నిజమే నువ్వు చెప్పింది. లోకం గొడ్డు పోయిందా? అచ్చొచ్చే సంబంధం చూసి చేసుకుంటే సరి పోతుంది. 'అని తనేదో మంచి

'గొడ్డొచ్చిన వేళ బిడ్డొచ్చిన వేళ అంటారు. కాబోయే అల్లుడైనా సరే. శుభం జరగాలి గాని అశుభం జరగడం మంచిది కాదు. మళ్లీ ఈ సంబంధాన్ని ఏం మంచి జరిగిందని చేసుకుంటారూ ? అని దీర్ఘం తీసింది. ' నిజమే నువ్వు చెప్పింది. లోకం గొడ్డు పోయిందా? అచ్చొచ్చే సంబంధం చూసి చేసుకుంటే సరి పోతుంది. 'అని తనేదో మంచి పరిష్కారాన్ని సూచించినట్లు అక్కడున్న వాళ్ల మొహాలను ఏమంటా రన్నట్లు చూసింది ఇంకొకామె. మూఢ నమ్మకాలకు పెద్ద పీట వేసే అమాయక పల్లె వాసులు కొందరు ఆ మాటలు విని అదీ నిజమే అనుకున్నారు.

పరిష్కారాన్ని సూచించినట్లు అక్కడున్న వాళ్ల మొహాలను ఏమంటా రన్నట్లు చూసింది ఇంకొకామె. మూడ నమ్మకాలకు పెద్ద పీట వేసే అమాయక పల్లె వాసులు కొందరు ఆ మాటలు విని అదీ నిజమే అనుకున్నారు. ఒకరిద్దరికి మంగమ్మ మాటలు విడ్డూర మనిపించాయి. బాధలో వాళ్లుంటే ఇప్పుడా ప్రసక్తి తేవడం అవసరమా అని చీదరించుకున్నారు. వాళ్లు ప్రేమించుకొని పెళ్లి చేసుకొంటుంటే వీళ్లేంటి ఇలా మాట్లడుతున్నారు అనుకున్నారు కొందరు.' దేనికయినా సమయం సందర్భం ఉండదా? ఎప్పుడూ అంతే . ఈ మంగమ్మ నోటికి అడ్డూ ఆపూ ఉండదు' అని పక్కన కూర్చున్న వాళ్లతో గుస గుసలాడింది పక్కింటి సుందరమ్మ. తేలుకు పెత్తన మిస్తే రెయ్యంతా కుట్టిందని మంగమ్మ మళ్లీ విజృంబించింది. 'వాళ్లను ఇంక బయలు దేర మనడం మంచిది. కట్టుకున్న మొగుడు మాదిరిగా ఆ బిడ్డిని ఒళ్లో పడుకో బెట్టుకున్నాడే. చూసే వాళ్లు ఎనుకుంటారనే ఇంగితమన్నా ఉండొద్దా ' అంది ముక్కు మీద వేలేసు కొని. అక్కడే ఉన్న కూతురు ' నువ్వు నోరు మూసుకుంటావామ్మా' అని కసిరింది. వెంటనే' అమ్మ సెప్పిన దాంట్లో తప్పేముండాది లేమ్మా' అనింది వాళ్ల ఇంట్లో బట్ట లుతికే రాజమ్మ. వాళ్లు ఎంత మెల్లగా మాట్లాడుకున్నా నిశ్శబ్దం రాజ్య మేలు తుండడతో అందరి చెవుల్లోనూ పడ్డాయి. సుస్మిత ఉన్నట్టుండి లేచి కూచొని గట్టి గానే ఏడ్వడం మొదలు పెట్టింది. విజ్ఞత తెలిసిన అవినాష్ మాత్రం వాళ్ల మాటల్ని ఏమాత్రం పట్టించుకోలేదు . సుస్మిత భుజాల్ని నొక్కి పెట్టి వాళ్ల మాటల్ని పట్టించుకోకు సుస్మితా ' అన్నట్లు ఓదార్చాడు.

ఆ రాత్రంతా అందరితో పాటు మగ పెళ్లి వారు ఎవరూ కూడా వాళ్ల కోసం ఏర్పాటు చేసిన గదులకు వెళ్ల మన్నా వెళ్ల లేదు. కంటి మీద రెప్పా వెయ్య లేదు.మర్నాడు పోస్ట్ మార్టం అయి రవి బాడీ ఇంటికొచ్చే సరికి మధ్యాన్నం రెండు దాటింది. ఏడ్పులతో ఊరూ నాడంతా దద్దరిల్లి పోయింది. అంత్య క్రియల ఏర్పాటులన్నీ సిద్ధంగా ఉన్నాయి . ఇక ఆలస్యం చేసే కొద్దీ వాళ్లను అనవరించడం కత్తి మీద సాము అనుకున్నారు. ఊరి పెద్ద అయిన అన్నాసామి అదేశంతో వెంటనే దహన సంస్కారాలు పూర్తి చేశారు. దగ్గర ఊర్లలో ఉన్న వాళ్లందరూ ఎక్కడి వాళ్లు అక్కడికి వెళ్లి పోయారు. మిగిలిన వాళ్లు స్నానాలు ముగించారుఈ రోజు ముందు రోజు చేసిన వంటలన్నిటిని ఊరి మొగదలలో ఉన్న దిబ్బలో పెద్ద గొయ్యి తవ్వి అందులో వేసి మట్టితో కప్పేశారు పని వాళ్లు . ఊర్లో ఉన్న దగ్గరి బంధువులు తాము చేసిన వంటకాలను తెచ్చి వంటిట్లో పెట్టారు. రెండు వందల మందికి సరిపడా వంటకాలు ఇల్లు చేరాయి. పిల్లా పీచుకు వడ్డించి ఆ తర్వాత ఒకరినొకరు బలవంతం చేసుకుంటూ ఎంగిలి పడి లేచారు. బలవంతం చేస్తే విజయ మజ్జిగ ఒక గ్లాసు తాగి ముడుచుకొని పడుకొంది . మగ పెళ్లి వాళ్లు భోజనాలు అయిందనిపించి వచ్చిన వాహనాల్లో బయలు దేరారు. దూరా బారం నుంచి వచ్చి రైళ్లలో , బస్సుల్లో వెళ్లే వాళ్లను కార్లలో తీసు కెళ్లి స్టేషన్లో దింపి వచ్చారు . కానీ పెళ్లి కొడుకుతో పాటు వాళ్ల అమ్మా నాన్న , మేనమామ మాత్రం ఉండి పోయారు . సుస్మితకు కాబోయే అత్త గారు బలవంతంగా రెండు ముద్దలు తినిపించింది. దగ్గరి వాళ్ల కంటే చొరవగా వాళ్లు మసలడం చూస్తున్న వాళ్లకు ఆత్మీయంగా అనిపించింది. ఆ మర్నాడు రవి ప్రాణం పోయి మూడవ రోజని కొంత మంది వెళ్లి దొంగ పాలు పెట్టి వచ్చారు. తర్వాత ఎక్కడి వాళ్లు అక్కడికి వెళ్లి పోయారు. అవినాష్ కు దిగులుతో ఉన్న సుస్మితను వదిలి పెట్టి వెళ్లాలంటే చాలా బాధనిపించింది. అయినా వెళ్లక తప్పదు కదా! ఇప్పటికే ఓర్వ లేని వాళ్లు అదే పనిగా పని కట్టుకొని అవినాష్ వాళ్ల చెవుల్లో పడేట్టు ఏదో ఒకటి అంటూనే ఉన్నారు. కానీ వాళ్లు సహృదయులు కాబట్టి ఆ మాటల్ని ఏమాత్రం పట్టించుకోలేదు. ఆ మాటల కంటే భర్తకు దూరమైన విజయ, తండ్రికి దూరమై వేదన పడుతున్న సుస్మిత ముఖ్యం అనుకున్నారు. బాధ పడకుండా ఉంటామని విజయ, సుస్మితల చేత చెప్పించుకొని బయలు దేరి వెళ్లారు వాళ్లు . అవినాష్ వాళ్లు వెళ్లి పోయాక సర్వం శూన్య మనిపించింది సుస్మితకు.

పదకొండవ రోజు దిన కార్యాలు. పెళ్లికి తెచ్చిన సరుకులతో ఆడంబరంగా జరిగి పోయింది. ఎక్కడి వాళ్లక్కడ వెళ్లి పోయారు . సుస్మిత , అవినాష్ లు మరో వారం రోజులు లీవ్ ఎక్స్టెండ్ చేసుకున్నారు. రోజు ఫోన్లలో అక్కడి నుంచి ఇక్కడికి ఓదార్పులతో కూడిన పరామర్శలు సాగుతూనే ఉన్నాయి. రవి లేని లోటు జీవితాంతం ఉంటుంది. కానీ క్రమంగా బాధ తగ్గు ముఖం పట్టింది. విజయ, సుస్మితలు మౌనంగా ఉన్నా దగ్గరి బంధువులు, సన్నిహితులు ఎవరి అభి ప్రాయాలను వాళ్లు వ్యక్తం చేస్తూనే ఉన్నారు. సంవత్సరం లోపు పెళ్లి జరపాలన్నది మెజారిటీ అభిప్రాయం. అచ్చి రాని ఆ సంబంధాన్ని తెగదెంపులు చేసుకోవడమే మంచిదని కొందరు.

మూణ్ణెళ్లు దాటాక పెళ్లి జరిపించిన వాళ్లను ఉదాహరించిన వ్యక్తిని ఒకరిద్దరు బలపరచిన వాళ్లూ ఉన్నారు. తల్లీ కూతుళ్లు మాత్రం నోరు తెరవ లేదు. సుస్మిత తమ్ముడు సురేష్ చిన్న వాడు . స్కూలుకు వెళ్లి రావడం తప్ప ఇంటి విషయాల్లో అవగాహన లేదు. సుస్మితకు ధైర్యం చెప్తూ అన్నిట్లోను ఆత్మీయంగా మసలుతూ ఉన్నది తన పెద్దమ్మ కోడలు నీలాంబరి. తాను సహకరించడమే కాక భర్తను కూడా సుస్మిత వాళ్లకు అనుకూలంగా మార్చింది నీలాంబరి. అవినాష్ కుటుంబ సభ్యులు కూడబలుక్కొని ఒక నిర్ణయానికి వచ్చారు. ఆచారాలన్నీ మనం ఏర్పాటు చేసుకున్నవే కాబట్టి ఎవరి వీలును బట్టి వాళ్లు వాటిని సడలిస్తే తప్పు లేదని వాళ్ల భావన. రిజిస్టర్ పెళ్లి చేసుకొని వెళ్లడం సబబుగా ఉంటుందని అవినాష్ అభిప్రాయం. సుస్మితకు కూడా తోడుగా ఉన్నట్లుంటుందని అదే మంచిదను కున్నారు అత్తింటి వాళ్లు. దానికి కావలసిన ఏర్పాట్లన్నీ అవినాష్ సిద్ధం చేసే ఉంచాడు. అంత సంస్కారం తన వాళ్లకు లేదని విజయకు తెలుసు. సుస్మిత ద్వారా విన్న నీలాంబరి భర్తను వాళ్లకు అనుకూలంగా మాట్లాడ మని కోరింది. భర్త ఎంత అట్టహాసంగా వివాహపు ఏర్పాట్లు చేశాడో విజయకే కాదు అందరికీ తెలుసు . ఇప్పుడున్న పరిస్థితుల్లోనే కాదు ఈ జ్ఞాపకాల నుండి బయట పడి సంవత్సరం లోపల పెళ్లి చెయ్యడం చేత కాని పని అని ఆలోచిస్తున్న విజయకు అవినాష్ చేసిన సూచన హాయిగా ఉంటుందనిపించింది. అత్త పోరు పడలేక వేరు కాపురం పెట్టినా రవి తమ్ముడు రాజుకు అన్న వదినలంటే ప్రాణం. అది గిట్టని అత్త మంగమ్మ సూటి పోటి మాటలంటూ ఉంటుంది. అలా మాట్లాడ్డం కూతురికి కూడా ససేమిరా నచ్చదు. ఆమెకు ఇంకెవరూ లేక పోవడం వల్ల కూతురింట్లోనే ఉంటుంది. పొలం మాసూళ్లు వసూలు చేసుకోవడానికి మాత్రమే అప్పుడప్పుడు వారం పది రోజులు వాళ్ల ఊరికి వెళ్లి వస్తుంటుంది. ఆమె కారణంగానే అన్నదమ్ములు విడి విడిగా ఉన్నారన్న విషయం అందరికీ తెలుసు. అవినాష్ చెప్పిన మాటను అక్క కొడుకు కోడలికి చెప్పింది. చేదోడు వాదోడుగా ఉంటున్న మరిది రాజుకూ చెప్పింది. ఇలా చెయ్యడమే బాగుంటుందని నేనూ అనుకొంటున్నాను అని తన అభిప్రాయాన్ని కూడా వ్యక్తం చేసింది. సుస్మితను ఇలాంటి స్థితిలో అమెరికాకు ఒంటరిగా పంపించడం ఇష్టం లేని విజయ అవినాష్ సూచించిన నిర్ణయాన్ని అమోదించింది. ఇలా చేస్తే రవి ఆత్మ కూడా శాంతిస్తుందని విజయ నమ్మకం. రిజిస్టర్ పెళ్లి విషయంలో నీలాంబరి దంపతులు , రాజు పూర్తి సహకారం అందించారు. మొదట రాముల వారి గుడిలో తాళి కట్టించి ఆ తర్వాత పెళ్లిని రిజిస్టర్ చేయించారు. పెళ్లి జరిగాక ముందుగా అశుభం జరిగిన ఇంటికి వద్దని ఎవరో సూచించారు.అందుకే ఏకంగా అత్తగారింట్లో దిగబెట్టి వచ్చారు. నీలాంబరిని సుస్మితకు తోడుగా ఉంచి వీళ్లు ఊరు చేరే సరికే ఎవరి ద్వారా తెలిసిందో కాని పెళ్లి వార్త ఏడూర్లలోనూ గుప్పుమంది. ఆచారాల్ని మంట గలిపినందుకు కొన్నాళ్లు చుట్టాలు, చుట్టూ ఊర్లలో ఉన్న వాళ్లు కూడా కాకుల్లాగా కావు కావు మన్నారు. అంతా విడ్డూరంగా ఉందంటూ రక రకాల విన్యాసాలతో బుగ్గలు నొక్కుకొన్నారు.




'ఏ ఆచారాలైనా మనం పెట్టు కున్నవే కదా. ఎవరి అనుకూలం ప్రకారం అవి ఒదిగి పోవాలి' అన్నారు సహృదయులు. 'శవమెల్లిన ఇంట్లో నెల లోపల పెళ్లి చెయ్యడం ఒక సంప్రదాయమై నిలదొక్కు కుంటుంది' అన్నారు అభ్యుదయ భావాలున్న వారు. 'మంచి పని చేశారు, ఎంతో సంతోషంగా పెళ్లి చేసుకొని భర్తతో కలిసి అమెరికాకు వెళ్లాల్సిన పిల్లే కదా! ఇప్పుడు తోడుగా భర్త ఉంటాడక్కడ. ఎవరూ తీర్చలేని బాధనుంచి కొంత ఉపశమనం' అని చాలా మందే అనుకున్నారు. భర్త మరణం తర్వాత ప్రశ్నార్థకంగా మిగిలి పోయి కంటి మీద కునుకు లేకుండా చేసిన సుస్మిత పెళ్లి ఇలా సుఖాంతం కావడం తల్లి విజయకు మాత్రం పెద్ద గండం నుంచి బయట పడిన ఫీలింగ్ నిచ్చింది. 'సంప్రదాయాలు మంట కలవనీ ! అవి సంతోషాన్నివ్వనప్పుడు ఎవరేమన్నా అనుకోనీ వాటిని పాటించాల్సిన అవసరం లేదు' అని గట్టిగా అనుకున్న తర్వాతే విజయ అల్లుడు చెప్పిన మాటకు అంగీకరించి సుస్మిత పెళ్లి నిర్ణయం తీసుకుంది. కూతుర్నీ అల్లుణ్ణీ ఫ్లైట్ ఎక్కించి కడపకు వెళ్తున్న వియ్యంకులకు నమస్కరించి వీడ్కోలు పలికింది విజయ. పరస్పరం భద్రంగా వెళ్లిరమ్మని జాగ్రత్తలు చెప్పుకున్నారు. భర్త తోడు లేకుండా ఏ చిన్న పనీ చెయ్యని, ఎక్కడికీ వెళ్లని విజయకు నిరంతరం తన మనసులోనే ఉన్న భర్త తనకు ఇలాగే ఎప్పుడూ ధైర్యాన్నిచ్చి నడిపించాలని మనసులో గట్టిగా

(మిగతా 23వ పేజీలో)



# మహిళా.. ధైర్యం చెయ్!

వందేళ్ల క్రితమే శ్రీ గురజాడ అప్పారావు మహాకవి అన్నట్లుగా "ఆధునిక మహిళ భారత దేశ చరిత్రను పునర్లిఖిస్తుంది" ఈ నాటి మహిళ శారీరక శ్రమకు తన మేధాశక్తిని జోడించి అనితర సాధ్యమైన అభివృద్ధిని సాధిస్తోంది. అన్ని రంగాల్లో తన అస్తిత్వాన్ని నిరూపించుకుంటుంది.

అయితే శ్రమైక జీవనానికీ, సౌందర్యాన్ని జోడించిన మహిళ తన శ్రమ దోపిడీకి గురి అవుతుందన్న వాస్తవాన్ని ఇప్పుడిప్పుడే అర్థం చేసుకుంటోంది అనిపిస్తుంది. తన శ్రమకి తగిన గుర్తింపు లభించడం లేదన్న విషయం గ్రహిస్తోంది.

స్త్రీకి, శ్రమకి మధ్య కామాలు ఉండకూడదనే సమాజంలోంచి ఆడవాళ్లకు, అంట్లపనికి అవినాభావ సంబంధం ఉందని సమాజంలోంచి ఇప్పుడిప్పుడే బయట పడటానికి ప్రయత్నం చేస్తోంది. ఆడపిల్లకి పదేళ్లు నిండగానే ఆమె చేతికి ముందు చీపుర, ఆ తరువాత అంట్లగిన్నెలు, ఆ తరువాత వంట వార్పులు ఇలా చాలా సహజంగా ఆమె వయసుతో పాటు వచ్చి చేరిపతాయి.

ఇందుకు మూలాల దాకా వెళ్లాల్సి వస్తే మనకి అర్థమయ్యేదేమిటంటే,

**గతంలో దాదాపుగా స్త్రీలు ఇంటి పనికి పరిమితమై ఉండేవారు. బయటి పనులు పురుషుల ఖాతాలో ఉండేవి. ఈ శ్రమ విభజన పద్ధతి వల్ల స్త్రీలు కొంత విశ్రాంతి నయినా పొందగలిగే వారు. కానీ రానురాను దేశ కాలమాన పరిస్థితులను బట్టి ఆర్థిక వసరాల నిమిత్తం స్త్రీలు బయట కూడా శ్రమ చేయాల్సి వస్తోంది.**

**సరిగ్గా అలాంటి సమయంలోనే స్త్రీలు తమ సహజ సిద్ధమైన మమకారం, ప్రేమ, ఓర్పు, సహనం వంటి లక్షణాల కారణంగా శ్రమ విభజన గురించి పనిలో సగభాగం పంచుకుని కుటుంబానికి అండగా నిలబడినపుడు, స్త్రీల ఖాతాలోని ఇంటి పనిలో కూడా పురుషులు సగభాగం పంచుకోవాలన్న విషయం గుర్తించబడ లేదు.** దీనికి కారణం బహుశా ఇంటి పని తమకి మాత్రమే వచ్చు అన్న స్త్రీల అభిజాత్యం ఒక కారణం.అయితే స్త్రీలలో అనాదిగా జీర్ణించుకుపోయిన ఆత్మన్యూనతా భావం, భయం, బానిసత్వ భావన, ఇంకోకారణం కావచ్చు. ఇక్కడ పురుషుడు చాలా తెలివిగా తన అహాన్ని ఇగోనీ, కాపాడుకుంటూ వస్తున్నాడు.

ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే స్త్రీలకు బయట ఉద్యోగమో, వృత్తి లేక వ్యాపారం ఏది చేయాల్సి వచ్చినా అందుకవసరమైన శ్రమతోపాటు లైంగిక వేధింపులు కూడా భరించాల్సి వస్తుంది. దీని వల్ల స్త్రీ తన సహజసిద్ధమైన సౌకుమార్యాన్ని సంస్కారాన్ని కోల్పోవాల్సి వస్తుంది. తన శ్రమ దోపిడీతోపాటు అవమానాన్ని అత్యాచారాల్ని భరించాల్సి రావడం వల్ల ఆమె శారీరకంగానూ,మానసికంగానూ కుంగిపోతోంది. చాలా సార్లు హత్యలకు, ఆత్మహత్యలకు పాల్పడవలసిన దారుణమైన పరిస్థితులు మహిళను వేధిస్తుంటాయి. **పురుషులు తమ శ్రమకు ఎంతగా గుర్తింపు, గౌరవం, తగిన వేతనం పొందుతున్నారో స్త్రీలు కూడా తమ శ్రమకు గుర్తింపు, గౌరవం, తగిన వేతనం పొంది తీరాలి.** ముఖ్యంగా మహిళ శ్రమకు తగిన గుర్తింపు, గౌరవం అనేవి సహజ న్యాయ సూత్రాల్లో భాగంగా అందరూ ఆమోదించి తీరాలి. అందుకు అవసరమైతే చట్టాల్లో మార్పులు తేవాలి. సామాజిక మాధ్యమాల ద్వారా దీనిగురించి విస్తృతంగా ప్రచారం చేయాలి. రోజుకున్న 24 గంటల్లో 8 గంటలు పని చేసి 16 గంటలు విశ్రాంతి పొందే పురుషుడికి రోజుకు 16 గంటలు పని చేసి 8 గంటలు కూడా విశ్రాంతి తీసుకోని మహిళకు తేడాను ఈ సమాజం గుర్తించి తీరాలి. ఇంటా బయటా శ్రమను అత్యంత సహనంగా భరిస్తున్న స్త్రీలు ముందుగా దీని గురించి ఆలోచించాలి. అంతకంటే ముందు స్త్రీలు తమకు బయట ప్రపంచంలో శ్రమ పడాల్సిన పరిస్థితి తప్పనిసరైనప్పుడు తమను తాము పూర్తిగా సన్నద్ధం చేసుకోవాలి.తాము పని చేసే చోట ప్రయాణాల్లో ఎదురయ్యే ప్రమాదాలను ముందుగా అంచనా వేయగలగాలి. వాటిని ఎదుర్కొనేందుకు వీలైనంత శారీరకంగా, మానసికంగా సిద్ధంగా ఉండాలి. అవసరమైన ముందు జాగ్రత్త చర్యలు తన మాన, ప్రాణ రక్షణకు అవసరమైన పరికరాలు కలిగి ఉండాలి. గురజాడ అన్నమట "మహిళా నీ అవగాహనను ఉపయోగించుకుని ధైర్యం చేయి"ని ప్రతిక్షణం మహిళలు మననం చేసుకోవాలి. మహిళ తన అసమాన మేధస్సును, అద్భుతమైన అవగాహనను ఆచరణలో పెట్టిన రోజున ఆమెకు ఈ సమాజం తలవంచక తప్పదు. అది ఇంట్లో అయినా బయట అయినా ఆమె శ్రమకు ఫలితం, గౌరవం దక్కక తప్పదు.

మహిళలు-సోషలిజం

# కఠినమైన వివాహ చట్టాలు



రెండు పెళ్లిళ్లు చేసుకున్న భర్త.. ఇద్దరు భార్యల మధ్య విభేదాలు రాకుండా తనే చూసుకోవాలి. ఇటువంటి నియమావళిని మగవారికి విధించడానికి, వారి ప్రవర్తనకు మత బోధకులను కూడా వినియోగించుకున్నారు. యుద్ధాల సమయంలో స్నేహితులు, శత్రువులు అన్న తేడా లేకుండా సైనికులు దోచుకుంటూ, విధ్వంసాలు చేస్తూ, మానభంగాలు చేస్తూ మారణహోమం సృష్టిస్తూ జర్మనీ దేశం మొత్తం విలయతాండవం చేశారు. యుద్ధాల తరువాత బిచ్చగాళ్లు, దొంగలు ప్రజలను భయభ్రాంతులను చేసి వాణిజ్యం, రవాణా అసాధ్యం చేశారు. ఈ కాలంలో వాణిజ్యం, పరిశ్రమలు దాదాపుగా నిలిచిపోయాయి. పూర్తిగా కుప్పకూలిపోయి తరువాత మెల్లిగా కోలుకున్నాయి. జనాలు ధైర్యం కోల్పోయి క్రమబద్ధమైన పనికి దూరమయ్యారు. ఈ సమయం స్త్రీలకు చాలా కష్టకాలమైంది. స్త్రీల పట్ల ద్వేషం విపరీతంగా పెరిగింది. నిరుద్యోగ భారం కూడా స్త్రీలపైనే పడింది.

తిరుగుబోతులైన పురుషులు, స్త్రీలతో రహదారులు, అడవులు, జైళ్లు నిండిపోయాయి. దురాశాపరులైన కులీనులు ఎన్నో రైతు కుటుంబాలను బలవంతంగా గెంటివేశారు. ఈ కారణం చేత ఈ కష్టాలు మరింతగా పెరిగాయి. సంస్కరణోద్యమాల తరువాత కులీనులపై రాజుల అధికారం పెరిగింది. కులీనులు కూడా ప్రొటెస్టంట్ చక్రవర్తులు ఉమ్మడి ఆస్తులను ఎలా దోచుకున్నారో వీరు కూడా అలాగే ఆక్రమించుకున్నారు. రైతుల ఆస్తులనూ, వారి పంట పొలాలనూ స్వాధీనం చేసుకున్నారు. ఇటువంటి పరిస్థితి నగరాల్లోనూ ఉండేది. అంతకముందు స్త్రీలు కూడా నిపుణులైన పనివారిగా గుర్తింపు పొందడానికి కూలి పనివాళ్లను సహాయకులను నియమించుకోవడానికి పురుషులు అభ్యంతరం తెలిపేవారు కాదు. పోటీని ఎదుర్కోవడానికి వారిని వృత్తి సంఘాల్లో చేరమని ఆదేశించేవారు. దుప్పట్లు, బట్టలు, తివాచీలు నెయ్యడంలో, కుట్టుపనిలో స్వతంత్రంగా స్త్రీలు పని చేసేవారు. కంసాలీ పనిలో, ఇనుప పనిలో కూడా పాల్గొనేవారు. ఉన్ని దుస్తులు తయారు చేసేవారు, చర్మవృత్తికారులుగా ఉండేవారు. తరువాత ఈ వృత్తుల్లో పోటీ పెరిగి పురుషులకు స్త్రీల పట్ల వ్యతిరేక భావన వచ్చింది. 17వ శతాబ్దంలో జర్మనీలో స్త్రీలను అన్ని వ్యాపారాల నుంచి తరిమేశారు. మొదట్లో వితంతువులు తప్ప ఆడవాళ్లు వృత్తి నిపుణులు కావడంలో నిషేధం ఉండేది. వాళ్లకు సహాయకులుగా కూడా ఒప్పుకోలేదు. ఈ కారణాలతో వితంతువులు, అనాథలు చాలా కష్టపడ్డారు. ఈ ఆర్థిక పరిస్థితుల వల్ల వివాహ చట్టాలు మరింత కఠినమయ్యాయి. తాము నివసించే సామాజిక బృందానికి భారం కాబోరని నిరూపిస్తేగానీ వృత్తి పనివాళ్లు స్త్రీ, పురుష శ్రమజీవులు పెళ్లిళ్లు చేసుకోకూడదు. చట్టపరిధిలో లేని పెళ్లిళ్లకు వేసే శిక్షలు ఆటవికంగా ఉండేవి. జైలు శిక్షగానీ, కొరడా దెబ్బలుగానీ ఉండేవి.

తరువాత కాలంలో కూడా జర్మనీలో రాజస్థానాలు అన్నీ భోగలాలసతో నిండి ఉండేవి. ఈ రాజ్యాలన్నీ విశృంఖల వ్యభిచారాన్ని ప్రోత్సహించేవి. 18వ శతాబ్దంలో రాజ సభల చరిత్ర అతి నీచంగా ఉండేది.

**వేశ్యల కోసం పిచ్చిపట్టినట్టుగా డబ్బు వెదజల్లడం, వృథా వ్యయానికి పాల్పడటం వీరికి వినోదమైంది. ఈ తరహా జీవన విధానం జర్మన్ రాజ్యాలన్నిటికీ శాపంగా మారింది. బూర్జువా కుటుంబానికి చెందిన యువతి రాజవంశీకులను గానీ, రాజులను గానీ ఆకర్షించగలిగితే ఆమెను ఆ కుటుంబమంతా అదృష్టవంతురాలిగానే భావించేవారు. ఆ యువతిని ఆస్థాన వేశ్యగా, రాజుకు ఉంపుడు గత్తెగా పంపడానికి ఆ కటుంబం సంపూర్ణంగా అంగీకారం తెలిపేది.**

90 శాతం ఈ విధానమే జరిగేది. సామంతరాజ్యాలలోని కుటుంబాల్లోనూ ఇదే పరిస్థితి ఉండేది. ఈ విధంగా సమాజంలో అన్ని వర్గాలు నైతికంగా పతనమయ్యాయి. వియన్నా, బెర్లిన్ దేశాల పరిస్థితి ఇంకా దారుణంగా ఉండేది. నైతిక పరివర్తనకు పేరెన్నికగన్న మరియా థెరిస్సా పరిపాలించిన వియన్నాలో కూడా 18వ శతాబ్దంలో ఇదే పరిస్థితి కొనసాగింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆమె అధోగతిపాలైన నైతికతను కాపాడలేకపోయింది.

**(మిగతా తరువాయి సంచికలో)**



# వివక్ష ఎందుకు?

సెప్టెంబర్ 21 న గురజాడ అప్పారావు గారి 158వ జయంతి. మహిళా సంఘాలు, అభ్యుదయవాదులు రాష్ట్ర వ్యాప్తంగా ఘనంగా నిర్వహించారు. 28వ తేదీ గుర్రం జాషువా జయంతి కూడా నిర్వహించారు. ఈ సందర్భంగా గురజాడ గారి రచనలతో బాటు ఆనాటి కాల మాన పరిస్థితులను ఒకసారి పరిశీలించినట్లయితే, 1862 ప్రాంతంలోనే లోనే మనదేశ అతున్నత మహానుభావులుగా కొనియాడ బడే మహాత్మా గాంధీ, వివేకానంద కూడా జన్మించారు. ఆ 1862 కి అయిదు సంవత్సరాల ముందు సిపాయిల తిరుగుబాటు జరిగింది. సిపాయిల తిరుగుబాటు విఫలమైన తరువాత ఇంగ్లండు రాణి భారత దేశంలో ఈస్టిండియా కంపెనీ పరిపాలన రద్దు చేసి, తిరుగుబాటుకు మద్దతిచ్చిన మొగలుల వంశస్థుడు, భారత దేశానికి చివరి రాజు అయిన 72 సంవత్సరాల వయసున్న బహదూర్ షా (అక్బర్ ముని ముని మనవడు)ని ఉరితీయించి పరిపాలనని తన హస్తగతం చేసుకున్నది. గురజాడ గారు తన 54 వ యేట 1915 లో చనిపోయారు. అదే సంవత్సరం గోపాల కృష్ణ గోఖలే పిలుపు మేరకు 1915 లో గాంధీజీ సౌత్ ఆఫ్రికా నుండి భారత దేశానికి తరలి వచ్చేశారు. మనదేశంలో గురజాడ వారి కాలం నాటికి హిందూ, ముస్లిం మతాలు ఆధిపత్యం కలిగి వున్నాయి. ఈ రెండు మతాలు కూడా వారి వారి

> **కన్యాశుల్కంలో బుచ్చమ్మ పాత్ర ద్వారా వితంతువైనంత మాత్రాన స్త్రీ జీవితం అయిపోలేదు, తిరిగి నీ ఇష్ట ప్రకారం జీవించు అని చెప్పారు. ఘోష అనే కథలో మొగుడు అసమర్థుడు, వృద్ధుడు అయితే తన కి బిడ్డ కావాలని, తనకి అది ప్రసాదించేందుకు కులం మతం చూడకుండా ఓ దళిత యువకుడితో ఆ బ్రాహ్మణ స్త్రీ సంభోగిస్తుంది. కులం భ్రష్టు పట్టించావు అని బ్రహ్మణులు తిడితే, 'అంత జ్ఞానం వుంటే మీకు 16 సంవత్సరాల వయసున్న నన్ను 80 ఏళ్ల వృద్ధుడికి ఇచ్చి పెళ్లి చేస్తారా?' అని ఎదురు తిరిగి తన హక్కుని ప్రకటిస్తుంది.**

సంప్రదాయాలు, నమ్మకాలను బలంగా విశ్వసించేవారు. ఏ మతమూ మహిళకు స్వేచ్ఛ నివ్వదు. కాబట్టి రెండు మతాల మహిళలూ తెరల చాటునే వుండేవారు. ఇంట గెలిచి రచ్చ గెలువు అన్న సామెత ప్రకారం గురజాడ వారు ముందు నా మతం లో ఉన్న దుస్సంప్రదాయాలు, మూడనమ్మకాలు పారద్రోలాలి అని నిశ్చయించుకున్నారు. బ్రాహ్మణులకే పరిమితమైన నాటి వేద పఠన విధ్య నుండి ఇంగ్లీషు విద్య లోకి, అన్నీ కులాల వారితో కలసి చదువు కోవడం ప్రారంభించిన తరువాత మనదేశంలోని ఎంతో మంది మేధావులు మన అజ్ఞానాన్ని ప్రశ్నించటం, తర్కించడం మొదలు పెట్టారు. మనుషులంతా సమానమే అన్న ఆధునిక ప్రజాస్వామిక పునరుజ్జీవన ఆలోచనా సరళికి మన గురజాడ అప్పారావుగారు కూడా ప్రభావితులయ్యారు. హిందూ మతంలో బలంగా వున్న వర్ణ వివక్షత, ఆర్థిక అంతరాలు, స్త్రీల పట్ల అణచివేతని నిశితంగా పరిశీలించారు. ఈ సమస్యల మీదనే ఆయన రచనలను చేశారు.

కన్యాశుల్కంలో బుచ్చమ్మ పాత్ర ద్వారా వితంతువైనంత మాత్రాన స్త్రీ జీవితం అయిపోలేదు, తిరిగి నీ ఇష్ట ప్రకారం జీవించు అని చెప్పారు. ఘోష అనే కథలో మొగుడు అసమర్థుడు, వృద్ధుడు అయితే తన కి బిడ్డ కావాలని, కులం మతం చూడకుండా ఓ దళిత యువకుడితో ఆ బ్రాహ్మణ స్త్రీ సంభోగిస్తుంది. కులం భ్రష్టు పట్టించావు అని బ్రహ్మణులు తిడితే, 'అంత జ్ఞానం వుంటే మీకు 16 సంవత్సరాల వయసున్న నన్ను 80 ఏళ్ల వృద్ధుడికి ఇచ్చి పెళ్లి చేస్తారా?' అని ఎదురు తిరిగి తన హక్కుని ప్రకటిస్తుంది. చివరికి ఆ యువకుడికే ఆమెని ఇచ్చి పునర్వివాహం చేస్తారు. ఆకథలో ఒక సందర్భంలో బ్రహ్మణులు దళితులచేత తమ మూత్రం తాగిస్తారు. ఇంకా ఆయన రాసిన అనేక కథలలో ఇలాంటి సామాజిక అంశాలని ఎత్తి చూపారు. పరిష్కారం కూడా చూపించిన మహా మేధావి.

నేటికీ మనం 158 సంవత్సరాల తరువాత కూడా ఆయన రచనలని చదువుతున్నాము, పరిశీలిస్తున్నాము. ఆదరిస్తున్నాము అంటే అర్థం ఏమిటి? రాజ్యాలు, రాజులూ పోయి, ప్రపంచ వ్యాప్తంగా మేధావులు, అభ్యుదయ

వాదులు ఈ భూమండలం మీద ప్రజలు సుఖ శాంతులతో ఎలా ఉండాలి, ఉంచాలి అని శోధించేందుకు ఐక్యరాజ్య సమితిని ఏర్పరుచుకున్నాం. తద్వారా సభ్య దేశాలలో అనేక చట్టాలను తయారు చేయించి, రాజ్యాంగ రచనలు చేసుకుని ముందుకు సాగిపోతున్నా, నేటికీ ఫ్యూడల్, పితృస్వామ్య భావాలు పాతుకుని ఉన్న దేశాలలో ఆర్థిక, వర్ణ, మహిళా వివక్షతలు వుంటూనే ఉన్నాయి. ఇటువంటి వివక్షలను ప్రశ్నించి,తిరగబడే మార్గాన్ని మనముందుంచారు. నేడు వరకట్నం లేదా మరో రూపమో స్త్రీ నుండి సొమ్మును నేటికీ వివాహాల సంధర్భంగా పురుషులు ఆశించే దురాచారం సాగుతోంది. వ్యవసాయంలో రైతులుగా, కూలీలుగా వున్నవారు ఎక్కువగా వెనుకబడిన కులాలు, జాతులు వారే ఎక్కువగా వున్నారు. రైతులను ఆత్మహత్యల పాలు చేస్తున్నారు. గురజాడ వారు 'కండ కలిగిన వాడే మనిషి' అన్నారు. అంటే అందరికీ ఆహారం అంది ఆరోగ్యంగా వుండాలంటే పంటలు బాగా పండాలి. పండించే వారు పుష్కలంగా వుండాలి. బాల్య వివాహాలు నిషేధించ బడినా ఇంకా జరుగుతూనే ఉన్నాయి వితంతు పునర్వివాహం చట్టబద్ధం అయ్యింది. కానీ నేడు ఎంతమంది వితంతువులు పునర్వివాహం చేసుకోవటానికి ముందుకు వస్తున్నారు? వితంతువును శుభ కార్యాలకు పనికి రాకుండా చేసిన సమాజం మారాల్సి ఉంది. ఎంతమంది భర్తలు తన భార్యని తనతో సమానంగా స్నేహితురాలిగా చూస్తున్నారు? డి ఏం సిచట్టం ప్రకారం మనదేశం లో వున్న అన్నీ హైకోర్టులలో, సుప్రీం కోర్టులో జరిగిన మహిళా తీర్పులపై ప్రతినెలా 200 పేజీలకు పైగా పుస్తకం విడుదల చేస్తారు. అందులో అన్నీ మహిళల అత్యాచారాలు, గృహహింస కేసులే వుంటాయి. ఇందులో పురుషుల చేతిలో కాలి బూడిదై పోయిన స్త్రీల కేసులు వందల సంఖ్య లోవుంటాయి. స్త్రీ పట్ల వివక్షత లేకపోతే ఈ ఘోరాలు ఎందుకు జరుగుతున్నాయి? ఐక్య రాజ్య సమితి సంభంధిత సంస్థ యూ ఎన్ఎఫ్‌పిఏతో కలసి లైంగిక, పునరుత్పత్తి ఆరోగ్య సంస్థలు సంయుక్తంగా నిర్వహించిన ప్రపంచ నివేదిక 2020 ప్రకారం ప్రపంచంలో గడచిన 50 సంవత్సరాల కాలంలో 14.30 కోట్ల మంది మహిళలు కనిపించకుండా పోయారు అని, అందులో మనదేశం నుండి నాలుగు కోట్లా అరవై లక్షల మంది మహిళలు కనపడ కుండా పోయారని ఆవేదన చెందింది.( ఈ డేటామనవి మాసపత్రిక నుండి సేకరించడమైనది) ఇంకా అనధికారికంగా ఇంకెంతమంది మాయమై పోయారో కదా! ఢిల్లీకి చెందిన సాంబశివరాజ్ సింగ్ అన్న ఆర్థిక శాస్త్ర విద్యార్థి జూన్ 2020లో రాసిన తన వ్యాసంలో మన దేశంలో కులవివక్షత తీవ్రంగా వున్నదని, ప్రతి 15 నిమిషాలకూ ఒక దళితుడి మీద ఎటాక్ జరుగుతున్నదని, ఆరుగురు దళితమహిళలు అత్యాచారం గావించబడుతున్నారని, సంవత్సరానికి 56 వేల మంది వారి చిన్నారులు రక్త హీనత తో మరణిస్తున్నారని తెలియ చేశాడు. నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో లెక్కల ప్రకారం 2016 నాటికి దేశవ్యాప్తంగా 40,801 కేసులు దళితులపై దాడులకు సంబంధించి కేసులు నమోదయ్యాయి. నేషనల్ లీగల్ సర్వీస్ ఆథారిటీ వారు మనదేశంలో ఉన్నంత దుర్భరంగా వితంతువులు ఏ దేశంలోనూ ఉండరేమో అని, వారికి ఆర్థిక సహాయం, వసతి సౌకర్యం ప్రభుత్వాలు ఖచ్చితంగా కల్పించాలి అని కొన్ని స్కీములు కూడా సూచించింది.అత్యాచార భాధితులకు నష్ట పరిహారం కూడా ప్రభుత్వాలు కల్పించాలి అని ఉత్తర్వులు జారీ చేసింది.

**ప్రతి 15 నిమిషాలకూ ఒక దళితుడి మీద ఎటాక్ జరుగుతున్నదని, ఆరుగురు దళితమహిళలు అత్యాచారం గావించబడుతున్నారని, సంవత్సరానికి 56 వేల మంది వారి చిన్నారులు రక్త హీనత తో మరణిస్తున్నారని తెలియ చేశాడు. నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో లెక్కల ప్రకారం 2016 నాటికి దేశవ్యాప్తంగా 40,801 కేసులు దళితులపై దాడులకు సంభంధించి కేసులు నమోదై నాయి అన్నది.**

గురజాడ వారు ఒకటిన్నర శతాబ్దం నాడే ఆయన రచనల్లో ఎలుగెత్తి చెప్పిన సమస్యలు నేటికీ ఇలా సాక్షీభూతంగా కనిపిస్తున్నాయి కాబట్టే మనం గురజాడ అప్పారావు గారిని, ఆయన రచనలనూ స్మరించుకుంటున్నాము. వ్యవస్థ మారటానికి అందరమూ మనవంతు కృషి చేయాలి. అందులో కళాకారులు,కవులు, రచయితల పాత్ర గణనీయమైనది. భాదితులు లేని నవ సమాజ నిర్మాణం కోసం చేసే కృషిలో గురజాడ స్ఫూర్తితో నేడు మహిళలు, యువత ముందు పీఠిన నిలబడాలి.

# అసాధారణ మహిళ రూత్ బాడర్ గిన్స్‌బర్గ్



**మొట్టమొదటిసారి సుప్రీం కోర్టు లింగవివక్షకు సంబంధించిన చట్టాన్ని కొట్టివేసే విధంగా వాదించి ఆమె కేసును గెలిచారు. అమెరికన్ సివిల్ లిబర్టీస్ యూనియన్(ఏసీఎల్‌ఉ) అమెరికన్ పౌర స్వేచ్ఛ సంఘం - మహిళా హక్కుల ప్రాజెక్టుకు 1972లో ఆమె సహ వ్యవస్థాపకురాలు.**

అమెరికా సుప్రీం కోర్టు (అత్యున్నత న్యాయస్థానం)లో జడ్జిగా పని చేసిన రెండో మహిళ రూత్‌బాడర్ గిన్స్ బర్గ్. ఈమె ఇటీవల తన 87వ ఏట మరణించారు. తన తీర్పులతో చరిత్ర సృష్టించారు. పితృస్వామ్య సమాజంలో లింగపరమైన న్యాయం కోసం జీవితాంతం నిర్భయంగా పని చేసిన వ్యక్తి ఈమె. తీవ్రమైన మాంద్యం సమయంలో జూఇష్ నుంచి న్యూర్లీఓని బ్రూక్లిన్‌కు వలసవచ్చిన దంపతులు ఈమె తల్లిదండులు. కార్నెల్ యూనివర్సిటీ (విశ్వవిద్యాలయం) నుంచి 1955లో రూత్ బాడర్ డిగ్రీ పూర్తి చేశారు.తన జీవిత భాగస్వామి మార్టిన్ 'మార్టీ' గిన్స్‌బర్గ్‌ను ఆమె ఇదే విశ్వవిద్యాలయంలో కలుసుకున్నారు.

గర్భిణుల పట్ల వివక్ష కొనసాగుతున్న రోజులవి. సాంఘిక సంక్షేమ కార్యాలయంలో పని చేస్తున్న రూత్‌బాడర్ తన మొదటి బిడ్డ గర్భంలో ఉన్న కారణంగా తన పదవి నుంచి దిగువ శ్రేణికి పంపబడ్డారు. ఈ అనుభవం కారణంగా 1965లో తన రెండో సంతానం గర్భంలో ఉన్న విషయాన్ని ఆఫీసులో చెప్పకుండా ఈమె రహస్యంగా ఉంచవలసి వచ్చింది.

హార్వర్డ్ లా స్కూల్‌లో 1956లో సీటు సంపాదించగలిగిన 500 మంది విద్యార్థులలో మహిళలు 9 మంది మాత్రమే ఉన్నారు. వారిలో రూత్ బాడర్ ఒకరు. 'ఈ స్కూల్‌లో పురుషుల సీట్లను తీసుకున్న మీ 9 మంది ఏ విధంగా దానికి న్యాయం చేయగలరు' అని వారి డీన్ వారిని బహాటంగానే ప్రశ్నించడం జరిగింది. అందరిలోకి ప్రథమురాలిగా ఉత్తీర్ణత సాధించినప్పటికీ, డిగ్రీ పూర్తి చేసిన తర్వాత ఆమెకు ఒక్క ఉద్యోగం కూడా రాలేదు. 'నేను ఒక జ్యూ ఇష్‌ను, ఒక మహిళను, మరియు ఒక తల్లిని' ఎంతటి ప్రతిభ ఉన్నప్పటికీ, ఈ మూడు కారణాల వల్ల తనకు ఉద్యోగం రాలేదని, వివక్ష ఎంత ప్రస్ఫుటంగా ఉందో తన మాటల్లోనే ఆమె తెలిపారు.

తర్వాతకాలంలో ఉత్తర అమెరికాలో మహిళల ఉద్యమాలు తిరిగి ఊపందుకున్న క్రమంలో రూట్ జెర్స్ లాస్కూల్‌లో రూత్ బాడర్ ప్రొఫెసర్ కాగలిగారు. అక్కడ ఆమె 'మహిళలు-చట్టాలు' అంశాలకు సంబంధించి తన మొట్టమొదటి పాఠ్యాంశాలను బోధించారు. ఆస్తి నిర్వహణాధికారం మహిళకు కాకుండా పారంపర్యంగా పురుషునికి దఖలు పరచటానికి సంబంధించి 'రీడ్ వర్సెస్ రీడ్' అనే కేసును ఆమె 1971లో వాదించారు. **మొట్టమొదటిసారి సుప్రీం కోర్టు లింగవివక్షకు సంబంధించిన చట్టాన్ని కొట్టివేసే విధంగా వాదించి ఆమె కేసును గెలిచారు. అమెరికన్ సివిల్ లిబర్టీస్ యూనియన్(ఏసీఎల్‌ఉ) అమెరికన్ పౌర స్వేచ్ఛ సంఘం - మహిళా హక్కుల ప్రాజెక్టుకు 1972లో ఆమె సహ వ్యవస్థాపకురాలు.** కొలంబియా లాస్కూల్‌లో మొట్టమొదటి మహిళా ప్రొఫెసర్‌గా ఎంపికయ్యారు. ప్రసవ సమయంలో ప్రాణాలు కోల్పోయిన యువతి భర్తకు అందవలసిన ప్రయోజనాలు-అలవెన్స్‌లు నిరాకరించబడిన కేసును 1975లో ఆమె వాదించారు. 'ప్రతి ఒక్కరిని లింగ వివక్ష ఏ విధంగా బాధిస్తుందో తెలియజెప్పే ఖచ్చితమైన ఉదాహరణ ఇతని కేసు' అని ఆమె ఈ సందర్భంగా అన్నారు. 1060-70 దశకంలో అమెరికాలో వెల్లువెత్తిన మహిళా ఉద్యమాలు ఆమెకు ఎంతో స్ఫూర్తినిచ్చాయి.

'చట్టపరంగా సమన్యాయం లభించాలంటే ప్రభుత్వ యంత్రాంగంలోని అన్ని విభాగాలు పురుషులకు ధీటుగా అన్ని విధాలా సమానమైన వ్యక్తులుగా మహిళలను గౌరవించాలి' చరిత్రలో మొట్టమొదటిసారి కోర్టుల ముందు ఈ విధంగా వాదించగలగటం సాధ్యపడింది' అని ఆమె పేర్కొన్నారు.

లోతైన, సుదీర్ఘ పరిశీలన తర్వాత 1993లో ప్రెసిడెంట్ బిల్ క్లింటన్ రూత్‌బాడర్ గిన్స్ బర్గ్‌ను సుప్రీం

కోర్టుకు (నామినేట్ చేశారు) ప్రతిపాదించారు. సుప్రీం కోర్టు

**అసాధారణ మహిళ రూత్‌బాడర్ గిన్స్‌బర్గ్**

**(20 తరువాయి)**

బెంచ్‌కు ఎంపిక కాబడిన రెండో మహిళ రూత్ బాడర్. మొదట ఎంపికయిన మహిళ 'సాండ్రా డే ఓకొన్నార్'. ఈమె 1981లో సుప్రీం కోర్టు బెంచ్‌కు ఎంపక చేయబడ్డారు. **వర్జీనియా మిలటరీ ఇన్‌స్టిట్యూట్‌లో పురుషులను మాత్రమే చేర్చుకునే కేసును రూత్‌బాడర్ కొట్టివేశారు. ఆమె ఇచ్చిన తీర్పులలో అత్యంత ప్రాధాన్యత కలిగిన, సంచలనం సృష్టించిన, త్వరతగతిన తీర్పు వెలువడిన కేసులలో ఇది ఒకటి.** తన పదవీకాలంలో ఆమె ప్రస్ఫుటంగా వామపక్షం వైపు ఉన్నారు. ముఖ్యంగా, డొనాల్డ్‌ట్రంప్ కాలంలో సాంప్రదాయవాద జడ్జీల సంఖ్య పెరిగిన క్రమంలో ఆమె వ్యతిరేక దిశలో చురుకైన పాత్ర పోషించి సమతుల్యతను అద్భుతంగా సాధించారు. 'ఒబామా కేర్'గా ప్రఖ్యాతి గాంచిన 2010లో వచ్చిన సంరక్షక చట్టంలోని ముఖ్యాంశాలను పటిష్టపరిచిన ఆరుగురు జడ్జీలలో ఆమె ఒకరు.

అమెరికాలోని మొత్తం 50 రాష్ట్రాలలోనూ స్వలింగ వివాహాలను చట్టబద్ధం చేసే అద్వితీయమైన తీర్పులో 5-4 మెజార్టీవైపు ఈమె నిలబడ్డారు. పురుషాధిక్య ప్రపంచంలో లింగపరమైన న్యాయం కోసం నిరంతరం స్త్రీవాదిగా గుర్తింపు పొందిన జడ్జీ రూత్ బాడర్ గిన్స్ బర్గ్. అమెరికన్ న్యాయ చరిత్రలో ముందుకు దూసుకపోగల చురుకైన సమయాన్ని, సందర్భాలను అందిపుచ్చుకుని స్త్రీ సమానత్వం కోసం తనకు తానుగా చరిత్ర సృష్టించిన వారిలో రూత్‌బాడర్ గిన్స్‌బర్గ్ ఒకరు. ఐద్వా (ఎఐడిడబ్ల్యుఎ- అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం) ఈ అద్వితీయ మహిళకు నివాళి అర్పిస్తోంది.

**- అరుణ (అనువాదం)**

# అత్యాచార నిందితులకు ఉరి పరిష్కారమా?

**బంగ్లాదేశ్‌లో** అత్యాచారం కేసులు భారీగా పెరగడంలో దేశం మొత్తం నిరసనలతో అట్టుడికిపోయింది. దీంతో కేంద్ర ప్రభుత్వం అత్యాచారం కేసుల్లో దోషులకు ఉరిశిక్ష విధించేందుకు వీలుగా చట్టాన్ని సవరించేందుకు ప్రధానమంత్రి షేక్ హసీనా నేతృత్వంలోని మంత్రివర్గం ఆమోదం తెలిపింది. ప్రస్తుతం ఆర్డినెన్స్ రూపంలో దీన్ని తీసుకొస్తామని ప్రకటించింది. అయితే ఉరి శిక్షతో అత్యాచారాలు ఆగిపోతాయనే గ్యారెంటీ ఉందా? దానికి ఆధారమేమైనా ఉందా?అంటే మౌనమే సమాధానం వస్తోంది.

బంగ్లాదేశ్‌లో గతకొంత కాలంగా అత్యాచార కేసులు భారీస్థాయిలో పెరిగిపోయాయి. కేవలం ఈ సంవత్సరం తొమ్మిది నెలల్లోనే దాదాపు వెయ్యి అత్యాచార కేసులు నమోదైనట్లు మానవహక్కుల స్వచ్ఛంద సంస్థలు పేర్కొంటున్నాయి. దీంతో మహిళాసంఘాలు, స్వచ్ఛంద సంస్థలు వీధుల్లోకి వచ్చి భారీ ఆందోళనలు చేపట్టాయి. అంతేకాకుండా ప్రభుత్వ తీరుపై సామాజిక మాధ్యమాల్లోనూ తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది.




దీంతో ప్రభుత్వం ప్రజల ఆగ్రహాన్ని చల్లార్చేందుకు అత్యాచార కేసుల్లో మరణశిక్ష విధించేందుకు అంగీకరించింది. దీనిలోభాగంగా వుమెన్ అండ్ చిల్డ్రన్ రిప్రెషన్ ప్రివెన్షన్ యాక్ట్‌ను తీసుకొస్తున్నట్లు తెలిపింది. **తాజా చట్టం ప్రకారం, అత్యాచారం కేసుల్లో దోషిగా తేలితే మరణశిక్ష లేదా జీవిత ఖైదు కఠినకారాగార శిక్ష అనుభవించాల్సి ఉంటుంది. ఇదివరకు అత్యాచారం కేసులో నేరం రుజువైతే గరిష్ఠంగా జీవితఖైదు మాత్రమే ఉండేది. ప్రస్తుతం దీన్ని మరణశిక్షకు పెంచనున్నారు.** అయితే, ప్రస్తుతం పార్లమెంట్ సమావేశాలు జరగడం లేనందున రెండు రోజుల్లో దీనిపై ఆర్డినెన్స్ తీసుకొస్తామని కేంద్ర న్యాయశాఖ మంత్రి అనిసుల్ హక్ ప్రకటించారు.

కొన్నిరోజుల క్రితం, దేశరాజధానికి 200కి.మీ దూరంలో ఉన్న నౌకాలీ ప్రాంతంలో ఓ మహిళపై కొందరు దుండగులు అత్యాచారానికి పాల్పడ్డారు. అంతేకాకుండా ఈ దుర్మార్గాన్ని వీడియోలో చిత్రీకరించారు. అనంతరం, నెల తర్వాత ఈ వీడియో సామాజిక మాధ్యమాల్లో వైరల్‌గా మారింది. అంతకుముందే, అధికార పార్టీకే చెందిన విద్యార్థి సంఘం నాయకులు మరో గ్యాంగ్‌రేప్ కేసులో అరెస్టయ్యారు.దీంతో ఆందోళనలు రాజధాని ఢాకాతోపాటు పలు నగరాలకు విస్తరించాయి. దీంతో 'రేపిస్టులను ఉరితియ్యాలి, రేపిస్టులను క్షమించకూడదు' అంటూ దేశవ్యాప్తంగా భారీ స్థాయిలో ఆందోళన కార్యక్రమాలు జరిగాయి. మహిళలపై అత్యాచారాలపై సుదీర్ఘంగా భారీ స్థాయిలో నిరసన, ఆందోళనలు జరగడం బంగ్లాదేశ్ చరిత్రలోనే తొలిసారి. దీంతో ఎట్టకేలకు దిగొచ్చిన ప్రభుత్వం, అత్యాచార కేసుల్లో దోషులకు కఠిన శిక్షలు విధించేందుకు సన్నద్ధమైంది. **- వాట్సప్ సౌజన్యం**

# స్వాములు, సన్యాసులు ఏమైపోయారు?



**మ**న అమాయకపు పని మనిషి వారి మతాధిపతి చేసే ప్రార్థనకు తన భర్తకు 'స్వస్థత' చిక్కి లేచి కూర్చుంటాడని నమ్మటం, మన పక్కింటి పిన్ని గారు మృత్యుంజయ మంత్రానికి భర్తకి ఆయుష్షు దక్కుతుందని అపోహ పడటం రెండూ అవివేకమైన పనులే. వారట్లా నమ్మి ప్రాణాలు పోగొట్టుకోవడం దురదృష్టకరం! ప్రతి మనిషీ భయం వల్లనే కొంత భక్తుడవుతుంటాడు. ఏదీ ఆశించని భక్తులెంతమంది? విశ్వాసమనేది ఉపశనమనాన్ని కలిగించటానికే తప్ప మావన యత్నాన్ని మానుకోమని కాదు కదా!

ప్రపంచ వ్యాప్తంగా ఇన్ని వేల సంవత్సరాల్లో ఎన్ని రకాలయిన ఉపద్రవాలు, ఉత్పాతాలు జరగలేదు! ఏ స్వాములు, ఏ పాస్టర్లు, ఏ ముల్లాలు కూడా వీటిని ఆపినట్లు ఎక్కడైనా రుజువులున్నాయా? అయినా మానవునిలోని 'ఆశ' దైవాన్ని నమ్మటానికే మొగ్గు చూపుతోంది. మళ్లీ తమకు తాము ఊరట చెందటానికే 'విధి' అనే గొప్ప 'ఊతాన్ని' పట్టుకొని ముందుకెళ్తూ ఉంటుంది. విధిని ఎవరూ తప్పించుకోలేరని తనకు తాను సర్ది చెప్పుకొంటోంది.

అయితే ఈ మధ్యలో కలిగే ప్రలోభాలకు లొంగిపోయి ఎవరో స్వాములు, సన్యాసులను వగైరాలను ఆశ్రయించటం! అదిగో అక్కడే వీళ్లు జనాల ఆశలను నెమ్మదిగా క్యాష్ చేసుకొంటున్నారు. దానికి తగ్గట్టు ఆ స్వామీజీలు చేసే యజ్ఞయాగాలకు రాజ్యాధికారం ప్రాప్తించిందని, గొప్ప యోగం పట్టిందని ఒకట్రెండు ఉదాహరణలు లభ్యం అవటంతో ఇక అంతా వారికి మోకరిల్లటం మొదలు పెడతారు. ఇక వారంతా రాజగురువులయిపోతారు.

**ప్రాచీన రాచరిక సంప్రదాయంలో రాజగురువుల సలహా మేరకు రాజులు నడుచుకొన్నట్లు నేటి ప్రభుత్వాధినేతలు నడుచుకుంటున్నారు. ప్రతిగా రాజగురువులను సంతోషపెట్టడానికి అపుడు గో, భూదానాలు చేస్తే ఇపుడు భూములు, ఖరీదైన (కోట్ల రూపాయల) కార్లు దానం చేస్తున్నారు. మన ప్రాచీన పురాణాదుల్లో సన్యసించటమంటే సర్వసంగపరిత్యాగం.. కానీ నేడు సలహాలతో సమస్త సుఖభోగ విలాసం. వీరి చుట్టూ వందిమాగధుల్లా శిష్యప్రశిష్యులు, విలాసవంతమైన భవనాలు..** పటకుటీరాల స్థానంలో పీఠాలు, ఆశ్రమాల పేర్లతో కోట్ల రూపాయల భవంతులు.. నౌకర్లు చాకర్లు.. 'సర్వేజనా సుఖినోభవంతు' అనేది నాటి నినాదమైతే, 'నాకు అన్ని యిచ్చిన వాడికే సుఖభోగ సంతోషాలు' అనేది నేటి మాట.

ఇదేదో ఒక రాష్ట్రానికే పరిమితం కాదు. దేశమంతా ఇట్లాంటి సాధువుంగవులున్నారు. వీరంతా ఈ కరోనా లాంటి ఉపద్రవాన్ని పారతోలటానికి యజ్ఞయాగాలు చేయవచ్చుగా! ప్రజలనందరినీ ఈ కష్టాన్నుంచి గట్టెక్కించవచ్చు కదా! వీరికంత శక్తి ఉంటే ఎంత బాగుంటుంది. వారు కూడా వైద్యుల వద్దకే వెళ్లారు. కానీ తమాషా ఏమిటంటే ఈ మతాన్ని కాపాడే దైవదూతలందరికీ కలవారి మీదనే కరుణ. అనాథలను, లేమిలో దిక్కుతోచక అల్లాడే వారికి వీరు ఏ విధమైన ఊరట కల్పించలేదు. మొన్నటికి మొన్న కాలినడకన వందల వేల మైళ్లు నడుస్తూ, కంటికి కాళ్లకు విశ్రాంతి లేకుండా మండుటెండలో కాళ్లు బొబ్బలెక్కుతుంటే పిల్లా జెల్లా నేసుకొని, నెత్తి మీద మూటలు మోస్తూ, ఆయాసంతో, అలసటతో అడుగులు తడబడుతూ ఉన్న చోటుని వదిలి పుట్టినూర్లకు వెళ్లడానికి అవస్థలు పడే వారికి ఏ మఠాధిపతులు, ఏ పీఠాధిపతులు, ఏ పాస్టర్లు, ఏ ముల్లాలు పిడికెడంత బువ్వ కూడా పెట్టలేక పోయారు.

వీళ్లు మళ్లీ జనాలకు

→

# అప్పారావుకు ఐద్వా జోహార్లు

తూర్పు గోదావరి ఐద్వా జిల్లా కార్యదర్శి రమణి తండ్రి అప్పారావు గారు ఇటీవల మృతిచెందారు. రమణి, అన్న డాక్టర్ చలం ప్రజా వైద్యులుగా పేరు పొందారు. వారి అన్నదమ్ములు ప్రజా ఉద్యమాల్లో భాగమయ్యారు. వారికి అప్పారావు స్ఫూర్తినిచ్చారు. వారి ముందుచూపు వారి బిడ్డలను విద్యావంతులను చేసింది. ఆర్థిక ఇబ్బందులున్నా పట్టుదల, ఆత్మవిశ్వాసం, ఆశావాద దృక్పథంతో వారిని



చదివించడంతోపాటు సామాజిక సేవలో ఆసక్తి కలిగేట్లు పెంచారు. హేతువాత దృక్పథంతో జీవితకాలం కొనసాగారు. నీలపల్లి గ్రామ పంచాయతీ మెంబర్‌గా వ్యక్తి ప్రయోజనాల కంటే గ్రామ ప్రయోజనాలే మిన్న అని నమ్మి గ్రామ పురోభివృద్ధికి నిరంతర కృషి చేశారు. మిస్టర్ పర్‌ఫెక్ట్‌గా పేరు తెచ్చుకున్నారు. ఓటమి సంభవించినంతమాత్రాన అపజయం కాదని, ప్రయత్నాన్ని విరమించి ఓటమిని అంగీకరించడమే నిజమైన ఓటమి అని, ఓటమి నుంచి అనుభవాలు నేర్చుకుని విజయం సాధించాలనేవారు. ఆయన చదువుకున్నది ఐదో తరగతే అయినా నిరంతరం వార్తా పత్రికలు, పుస్తకాలు చదవడం ఆయనకు అలవాటు. పిల్లలు కులాంతర వివాహాలు చేసుకోవడానికి సిద్ధపడినప్పుడు వారి ఆలోచనలను ఆశీర్వదించారు. ఆయన మృతికి ఐద్వా రాష్ట్ర కమిటీ జోహార్లు అర్పించింది.

---

**స్వాములు సన్యాసులు ఏమైపోయారు**

**(తరువాయి)**

ఇహలోక సౌఖ్యాలను గూర్చి కాక పరలోక సుఖాలను గూర్చి ఉపన్యాసాలు దంచుతారు. తమ తమ పదవులను ఆశించి వచ్చే 'నాయకమణులు'కు వీరెందుకు పరిహితం చేయమని బోధించటం లేదో! వీరి ఆధ్వర్యంలో గుళ్ల కోసం కోట్లు వెచ్చింపజేస్తారు కదా, ప్రభుత్వాధినేతల చేత. అట్లాకాక ప్రజల హితార్థం ఖర్చు చేయమని ఎందుకు చెప్పరు? వీరికి కావలసింది 'స్వలాభం' ఫలానా నాయకుడు తన పీఠాన్ని దర్శించాడంటే, తనకాళ్లకు నమస్కరించాడంటే తన 'క్రేజ్' జనాల్లో పెరుగుతుంది కదా! అందువల్ల తన దర్శనాలకు, తన కటాక్ష వీక్షణాలకు జనం క్యూ కడుతారు కదా! అట్లా కీర్తి, కనకం కూడా దక్కుతాయి.

'డేరా బాబా' 'నిత్యానంద స్వామి' లాంటి దొంగ బాబాలు భక్తి పేరుతో ఎంత భ్రష్టులుగా ప్రవర్తించారో తెలిసిందే కదా! ప్రజల విశ్వాసాలను ఊతంగా చేసుకొని రాజకీయాల్లోకి కూడా వేలు పెడుతూ 'సన్యసించడం' అనే మాటకున్న విలువల్ని గాలికొదిలేశారు. సొంత స్థలాలు, సొంత భవనాలు, సొంత రాజ్యం, సొంత సైన్యం (భక్తులు) ఇష్టారాజ్యంగా మెలుగుతూ ఆఖరకు అమ్మాయిలకు వల వేస్తూ, గుట్టుగా హత్యాకాండలు కొనసాగిస్తున్నారు. కొందరి బాబాల ఆశ్రమాల్లో బినామీలుగా ధనాలు దోచుకుంటున్నారు. దాచుకుంటున్నారని ప్రచారం వచ్చింది. ఆపదల్లో కష్టంలో ఉన్న వారిని ఓదార్పు పేరుతో మ్యాజిక్కులు, జిమ్మిక్కులు చేసి నమ్మకం కలిగించి పబ్బం గడుపుకునే ఈ దొంగ స్వాములు అన్ని మతాల్లోను ఉన్నారు.

**వర్తమాన పరిస్థితుల్లో, ఈ అల్లకల్లోల సమయంలో ఈ ఆపదల నుంచి వారి మహిమాన్వితంతో జనాలను గట్టెక్కించగలిగిన వారు ఒక్కరున్నా వాళ్ల కాళ్లకు మొక్కుదాం. వారి గురుత్వాన్ని స్వీకరిద్దాం. కాని ఎవరూ అలాంటి వారు ఇంత వరకు కనబడలేదు.** అన్నీ చూడండి, వినండి, నిశితంగా పరిశీలించండి, అప్పటి వరకూ దేన్నీ నమ్మకండి. అనవసరంగా మోసపోకండి.

# మూఢత్వం వదిలెయ్!

**(15వ పేజీ తరువాయి)**

కోరుకుంది. ఆయన తోడు లేకుంటే నెల లోపల సుస్మిత పెళ్లి చెయ్య గలిగేదాన్నా? అని ప్రశ్నించుకొంది. బెంగుళూరు ఏర్పోర్ట్ నుంచి కార్లు ఊరికి బయలు దేరాయి. మరిది డ్రైవర్ పక్కన ముందు సీట్లో కూర్చున్నాడు.వెనక సీట్లో విజయ, సురేష్. ఇంకో కార్లో నీలాంబరి, రాజు భార్య వెనక సీట్లో కూర్చున్నారు. రాజు డ్రైవ్ చేస్తుంటే నీలాంబరి భర్త పక్క సీట్లో కూర్చున్నాడు. టైం పదకొండు దాటింది .కార్లు రెండూ చిత్తూరు దారి పట్టాయి మేల్కొని రోడ్డు వైపు చూస్తున్న కొడుకును 'ఇలా పడికో నాన్నా' అంటూ ఒళ్లో పడుకో బెట్టుకొంది విజయ. పుట్టెడు బాధను మూట కట్టుకొని భర్తతో అమెరికాకు తిరుగు ప్రయాణమైంది సుస్మిత.అది గమనించిన అవినాష్ ఆమె చేతిని గట్టిగా ఒత్తి పట్టుకున్నాడు. పెళ్లి చెయ్య కుండా ఒంటరిగా సుస్మితను అమెరికా పంపించి ఉంటే ఎలా ఉండేది అని ఊహించుకొని ఉలిక్కి పడింది విజయ.

అక్కడ ఒంటరిగా తండ్రిని తలుచుకుంటూ ఏడుస్తూ ఉండకుండా కంటికి రెప్పలా చూసుకొనే అల్లుడు అవినాష్ తోడుంటాడని అనుకోగానే నిశ్చింతగా అనిపించింది విజయకు. తనకు తెలియ కుండానే ఎప్పుడు కునుకు పట్టిందో ధ్యాస లేదు ఆమెకు. ' వదినా 'అన్న మరిది గొంతు విని ఉలిక్కి పడి లేచిన విజయ ఇంటి ముందు కారు ఆగి ఉండడాన్ని చూసి కొడుకును నిద్ర లేపింది.

మానవి బృందం

# ఒక్కరోజే కాదు ఈ స్ఫూర్తి.. ఎప్పుడూ కొనసాగాలి



**అమ్మాయిలు ఎందులోనూ తక్కువ కాదు. ఇంటా బయటా, ఆఖరికి అంతరిక్షంలోనూ అనేక విజయాలు సాధించారు, సాధిస్తూ సాగుతున్నారు. అయినా సరే ... అమ్మాయిల పట్ల కనిపించి కొంత, కనిపించకుండా మరికొంత వివక్ష, చిన్నచూపూ కొనసాగుతూనే ఉన్నాయి. అలాంటి పక్షపాత, పాక్షిక భావాలకు పాతర వేసి.. అత్యున్నత విజయాలను సాధించే అమ్మాయిల అమేయ శక్తిని దశదిశలా చాటాల్సిన అవసరం చాలా ఉంది. అంతర్జాతీయ బాలికా దినోత్సవం సందర్భంగా ప్రపంచంలో పలుచోట్ల జరిగిన ఈ నమూనా ప్రయత్నం అభినందనీయం. అది ఒక్కరోజే కాదు అన్నిరోజులూ స్ఫూర్తిదాయకంగా సాగాలి.**

అక్టోబరు 11న అంతర్జాతీయ బాలికల దినోత్సవాన్ని పురస్కరించుకుని ప్రపంచవ్యాప్తంగా పలు దేశాలు స్త్రీలకు అత్యున్నత గౌరవ సత్కారాలు అందించాయి. వాటిలో అనంతపురం జిల్లా కూడా చేరింది. ఆ జిల్లాలోని అన్ని ప్రభుత్వ శాఖల్లో సుమారు 500 మందికిపైగా బాలికలు అధికారులుగా ఆదివారం విధులు నిర్వహించారు. కలెక్టరు గంధం చంద్రుడు చొరవతో వారికి ఈ అవకాశం దక్కింది. ఆ బాధ్యతలు ఒక్కరోజే అయినా ఎంతో నిబద్ధతగా వ్యవహరించారు ఆ బాలికలు. కలెక్టరుగా బాధ్యతలు నిర్వహించిన ఎం.శ్రావణిది వ్యవసాయ కుటుంబం. తల్లిదండ్రులు వ్యవసాయ కూలీలు. రెక్కాడితే గాని డొక్కాడని కుటుంబాలు వారివి. గార్లదిన్నె కస్తూరిబా పాఠశాలలో ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతున్న శ్రావణి కలెక్టరుగా రెండు ఫైళ్ల మీద సంతకం చేసింది. అవి రెండూ మహిళలకు సంబంధించిన అంశాలే. ప్రభుత్వంలోని ఒక ఉన్నతాధికారిగా బాధ్యతలు తీసుకోవడంపై ఆమె చెప్పిన అభిప్రాయం వింటే ఇంత చిన్నవయసులో ఎంత పెద్ద పెద్ద ఆలోచనలో అని అనుకుంటాం. తన గ్రామంలో ఉన్న రైతు కుటుంబాలు ఈ ఏడాది వర్షాభావానికి పంటలు నష్టపోయారు.. వారికి లబ్ధి చేకూర్చాలంటుంది శ్రావణి. ఇంకా గ్రామంలో పారిశుధ్య నిర్వహణ సరిగ్గా లేదు. వెంటనే వాటిని సక్రమంగా నిర్వహించాలి అంటుంది. ముఖ్యంగా తన ప్రాంతంలో బడి మధ్యలో ఆపేసే విద్యార్థులే ఎక్కువగా ఉన్నారు. అందుకే ఆ ప్రాంతంలో విద్య అవకాశాలపై అవగాహన కల్పిస్తానంటోంది. **'కలెక్టరు పెద్ద హోదానే కావొచ్చు. కాని మా ప్రాంతంలో విద్యావకాశాలు మెరుగుపరచడమే లక్ష్యంగా టీచరు కావాలన్నదే నా కోరిక'** అంటుంది శ్రావణి.

ఇంతమంది బాలికలు జిల్లా వ్యాప్తంగా అనేక పదవులను అధిరోహించడం వెనుక జిల్లా కలెక్టరు గంధం చంద్రుడు కృషి ఎనలేనిది. 'అత్యున్నత పదవులను అధిష్టించడం వల్ల ఆ బాలికలు తమ లక్ష్యాలను ఉన్నతంగా తీర్చిదిద్దుకుంటారు. వారి కుటుంబాలు కూడా బాలికా విద్యకు ప్రోత్సాహం ఇస్తాయి. ఇది వారిలో ఎంతో నమ్మకాన్ని, ధైర్యాన్ని, చదువుపై ఆసక్తిని కలిగిస్తుందని' అంటారు ఆయన.

## అంతర్జాతీయ గుర్తింపు

వెంకటేశ్వరనిల్లీకి చెందిన 18 ఏళ్ల చైతన్య వెంకటేశ్వరన్ బ్రిటన్ రాయబారిగా బాధ్యతలు తీసుకుంది. 2017 నుంచి 'హై కమిషన్ ఫర్ ఎ డే' అంశంపై బ్రిటన్ ప్రతి ఏడాది ఈ పోటీ నిర్వహిస్తోంది. ఈ పోటీలో భారతీయ యువతులనే ఆహ్వానించడం ఆనవాయితీగా ఉంది. **'అధికారులకు విధులు అప్పగించడం, మీడియాతో మాట్లాడడం, మహిళా సమస్యలపై చర్చించడం**

→

## ఈ స్ఫూర్తి ఎప్పుడూ కొనసాగాలి

**(24 తరువాయి)**

**ఎంతో మంచి అవకాశమ'ని చైతన్య అంటూంటే ఆమె కళ్లు ఆనందంతో మెరిశాయి. 'ఆ బాధ్యతలు తీసుకుంది ఒక్కరోజే కాని నా జీవితంలో ఎన్నో విజయాలను అందుకోవడానికి అదొక గొప్ప స్ఫూర్తిగా నిలుస్తుంది'** అంటుంది చైతన్య. ఇటీవల ఢిల్లీలోని ఉన్నత పాఠశాల విద్య పూర్తి చేసింది చైతన్య. ఇంటర్‌నేషనల్ స్టడీస్ అండ్ ఎకనామిక్స్‌లో పూర్తి స్కాలర్‌షిపుతో అమెరికన్ యూనివర్శిటీలో బ్యాచిలర్ డిగ్రీ చదువుతోంది. నాయకత్వం, రాజకీయ అంశాలపై అధ్యయనాలు చేస్తోంది. వైకల్య బాధిత విద్యార్థులు, యాసిడ్ దాడుల బాధితులు, పేదరికంతో బాధపడుతున్న సమూహాల కోసం ఆమె నిరంతరం పనిచేస్తూ ఉంది. అందుకే కాబోలు బ్రిటిష్ ఉన్నతాధికారిగా బాధ్యతలు తీససుకోవడంతోనే 'మీడియాలో మహిళల పాత్ర'పై ఓ పత్రిక సంపాదకునితో చర్చించింది. అమ్మగా, అక్కగా, చెల్లిగా, భార్యగా తనలో తాను పరకాయ ప్రవేశం చేస్తుంది మహిళ. అంతటి సామర్థ్యం ఉన్న అతివకు ఒక్కరోజు బాధ్యతలు చేయడం ఏమంత కష్టం కాకపోవచ్చు. కాని ఆమెలో ఉన్న ప్రతిభను గుర్తించేది ఒక్కరోజేనా? ఆమెకు ఇచ్చే గుర్తింపు 24 గంటలకే పరిమితమా? ఆ స్ఫూర్తిని కొనసాగించాలి. బాలికలు తనను తాను తీర్చిదిద్దుకుంటూనే అన్నింటా ప్రతిభకు అవకాశాలు కల్పించాలి.

## ఫిన్‌లాండ్ ప్రధానిగా 16 ఏళ్ల అవా మూర్తో




మహిళలు ఎదుర్కొంటున్న సవాళ్లను, సాధికారతను ప్రపంచానికి ఎలుగెత్తి చాటడమే ఉద్దేశంగా పనిచేస్తున్న వారు ఈ ప్రపంచంలో అరుదుగా ఉన్నారు. ఆ జాబితాలో ఫిన్‌లాండ్ దేశం ఒకటి. లింగ సమానత్వం సాధించడంలో అది ఎప్పుడూ ముందు వరుసలో ఉంటుంది. లింగవివక్షను అధిగమించడంలో తనకు తానే ఏడాదికేడాది పోటీపడుతూ ఉంటుంది. అయినప్పటికీ అక్కడి మహిళలు సాంకేతికంగా వెనుకబడి ఉన్నారని వారిలో స్ఫూర్తిని నింపేందుకు పలు కార్యక్రమాలు చేపడుతోంది. అందులో భాగంగానే అంతర్జాతీయ బాలికల దినోత్సవం నాడు దేశంలోనే అత్యున్నత పదవికి ఫిన్‌లాండ్ ప్రధానిగా 16 ఏళ్ల అవా మూర్తోను ఎంపిక చేసింది. సామాజిక అంశాలపై అవగాహన కలిగి ఉండడం మూర్తో ప్రత్యేకత. వాతావరణ మార్పు, మానవ హక్కుల ప్రచార కార్యకర్త. సాంకేతిరంగంలో యువత సమర్థవంతంగా పనిచేయాలని ప్రోత్సహించేది. 'పెద్దవారు అభివృద్ధి పథం వైపు ఆలోచించాలంటే అది యువత వల్లే సాధ్యం' అంటుంది ఆమె. ఈవిధంగానే కెన్యా, పెరూ, సూడన్, వియత్నాం వంటి దేశాలు తమ దేశాల్లోని యువతులకు అత్యున్నత పదవులు ఇచ్చి గౌరవించాయి.

# రుతుస్రావం నేరమా?

**- తరగతి గదిలో 'రుతుస్రావం'పై ఉపాధ్యాయురాలి అవమానం**
**- తమిళనాడులో విద్యార్థిని ఆత్మహత్య**

అవగాహన కల్పించి అక్కున చేర్చుకోవాల్సిన వారే అవమానించడంతో తట్టుకోలేక పోయింది ఆ బాలిక. రుతుస్రావంపై తోటి విద్యార్థుల ముందే ఉపాధ్యాయురాలు మందలిస్తుంటే జీర్ణించుకోలేక, ఏం సమాధానం చెప్పాలో తెలియక తల్లడిల్లింది. చివరకు ప్రాణాలను తీసుకోవాలని నిర్ణయించుకుంది. తెల్లవారుజామున మేడపై నుంచి దూకేసింది. ఈ ఘటన తమిళనాడులోని తిరునెల్వేలి జిల్లా పాళయంకొట్టైలో చోటుచేసుకుంది. పాళయంకొట్టైకు చెందిన సబ్రీన్ హాజీరా స్థానికంగా ఉండే పాఠశాలలో ఏడో తరగతి చదువుతోంది. తరగతి గదిలో రుతుస్రావం అవడంతో దుస్తులకు రక్తపు మరకలు అంటుకున్నాయి. దీన్ని చూసిన తోటి విద్యార్థులు ఆమెను ప్రశ్నించారు. సబ్రీన్ శుభ్రం చేసుకుని వస్తానని ఉపాధ్యాయురాలి అనుమతి కోరింది. దీనిపై ఎందుకు అప్రమత్తంగా లేవని టీచర్ మందలించారు. రక్తపు మరకలపై అనుమానం వ్యక్తం చేస్తూ, వెంటనే తరగతి గది నుంచి వెళ్లాలని కోరారు. ఇదే విషయంపై పాఠశాల ప్రిన్సిపాల్‌కు కూడా ఫిర్యాదు చేశారు. ఈ అవమానంతో కలత చెందిన సబ్రీన్ అన్ని విషయాలనూ వివరంగా లేఖలో పొందుపర్చి పొరుగున ఉన్న ఇంటి మేడపైకి ఎక్కి దూకేసింది. కేకలు విన్న ఇరుగుపొరుగు వారు, కుటుంబ సభ్యులు వెంటనే బాలికను ఆస్పత్రికి తరలించారు. మార్గమధ్యలోనే ఆమె ప్రాణాలను కోల్పోయిందని పోలీసులు తెలిపారు. బాలిక లేఖ ద్వారా విషయం తెలుసుకున్న బాలిక తల్లిదండ్రులు, గ్రామస్థులు సదరు పాఠశాల ముందు ఆందోళనకు దిగారు. పోలీసులు కేసు నమోదు చేసి దర్యాప్తు చేపట్టారు.



## 'నిర్భయ'ంతో మొదలై..

# నిబ్బరంగా ముందుకు!

ఆమెకు 2012 వరకు ఆడపిల్లగా తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోడానికి పోరాటం చేయడమే సరిపోయింది. ఆ తరువాత ఏ ఆడపిల్లకూ అన్యాయం జరక్కూడదని నిర్ణయించుకుంది. దేశ వ్యాప్తంగా సంచలనం సృష్టించిన నిర్భయ కేసును వాదించింది. ఈమె తలపండిన న్యాయవాది కాదు. ఆమెకు అదే తొలి కేసు. వెనక్కు తగ్గలేదు. బెదిరింపులకు భయపడలేదు. ఒంటరినని వెరవలేదు. న్యాయం గెలవానుకుంది. నిర్భయ నిందితులకు శిక్ష పడేలా చేసింది. అదే స్ఫూర్తితో ఇప్పుడు హథ్రాస్ బాధితురాలి తరుపున మరోసారి పోరాడుతోంది.ఆమే సీమా సమృద్ధి కుష్వాహ.

ఆమె తొలి కేసు వాదించేనాటికి ఇంకా ఢిల్లీ యూనివర్సిటీలో పీజీ చదువుతోంది. సివిల్స్ రాయడం ఆమె కల. సాటి ఆడపిల్లగా నిర్భయ అనుభవించిన నరకాన్ని తలుచుకొని రగిలిపోయింది. నిర్భయ హంతకలను శిక్షించాలని వేలాది మంది యువత ఇండియా గేటును చుట్టుముట్టారు. ఆ సమూహానికి సీమా నాయకత్వం వహించింది. వీరిపై నీటి పిరంగులు వదిలారు. లాఠీలు విరిగాయి. పోలీసు దెబ్బలు భరించారు. అయినా ఈమె వెనుతిరగలేదు. నిర్భయ జ్ఞాపకార్థం జరిగిన సమావేశంలో ఆమె తల్లిని కూడా కలుసుకుంది. ఈమెకు ఏపీ సింగ్ నిర్ణయం ఒక పెద్ద సవాలైంది. క్రిమినల్ లాయర్‌గా 25 ఏళ్ల అనుభవమున్న సింగ్ నిందితుల తరుపున వాదించేందుకు ముందుకు వచ్చాడు. నిర్భయకు ప్రభుత్వం ఒక న్యాయవాదిని అప్పగించింది. దోషులకు జిల్లా కోర్టులో మరణశిక్ష పడింది. కానీ అది అమలు కాలేదు. ఏళ్లకేళ్లు గడిచిపోయాయి. నిర్భయ తల్లి తన కూతురికి ఇక న్యాయం జరగదని నిరాశ పడింది. కానీ సీమా నిర్భయ తల్లికి ధైర్యం చెప్పి ఆ కేసు తాను వాదిస్తానని ముందుకొచ్చింది. అంతేకాదు నిందితులకు శిక్ష పడేలా చేసింది.

ఈ తెగువ, ఈ ధైర్యం ఆమెకు ఎక్కడినుంచో రాలేదు. తన జీవితంలో నుంచే వచ్చింది. ఆడపిల్ల పుట్టిందని ఆమె కన్నతల్లితో సహా అందరూ ఆమెను చంపేయాలనుకున్నారు. ఆ కుటుంబంలో నాలుగో అమ్మాయి సీమా. కానీ తండ్రి, మేనత్త అడ్డుపడటంతో ఆమె బతికింది. కాస్త ఎదిగాక చదువెందుకన్నారు. స్కూలుకు పంపడానికి అనేక అభ్యంతరాలొచ్చాయి. చదువుకోవడానికి అన్నకు లేని అభ్యంతరం తనకెందుకని ఆమె తండ్రిని నిలదీసింది. ఇలాంటి ఇబ్బందుల మధ్య ఏడో తరగతి పూర్తి చేసింది. ఎనిమిదో తరగతిలోకి రావడానికి పెద్ద యుద్ధమే జరిగింది.ఆ ఊరి నుంచి ఎనిమిదో తరగతి చదువుకున్న బాలిక ఆమేనట. ఉత్తరప్రదేశ్‌లోని ఉగర్పూర్ ఈమె స్వస్థలం. గూగుల్‌లో వెతికినా కనిపించనంతటి చిన్న గ్రామమది. ఆరుగురు పిల్లల్లో నాలుగో అమ్మాయి సీమా. చదువుల్లో, ఆటల్లో ముందుండే ఆమె కాళ్లకు బంధం వేయాలని చుట్టుపక్కలవాళ్లు, కుటుంబ సభ్యులు తరచూ ప్రయత్నిస్తుండేవాళ్లు. పదో తరగతి తరువాత ఇంట్లో వాళ్లు పెళ్లి చేయాలనుకున్నారు. అప్పుడామె తిండిమానేసి నిరసన చేసింది. అప్పటికే ఆమెను పెళ్లి చేసుకోవడానికి చూడవచ్చిన కుటుంబం ఇది తెలిసి వెనక్కు వెళ్లింది.తన కాళ్ల పట్టీలు, చెవిపోగులు అమ్మేసి కాలేజీలో చేరింది. స్నేహితురాలి సహాయంతో ఎల్ఎల్‌బీ పూర్తి చేసింది. ఎప్పుడూ చిన్నపాటి ఉద్యోగం చేస్తూనే తాను చదువుకుంది. ఢిల్లీ యూనివర్సిటీలో పీజీలో చేరింది. నిర్భయ ఘటన జరిగినప్పుడు 'నా జీవితమంతా నా కోసం పోరాడాను. ఇప్పుడు నేను నేరుగా పోరాటంలోకి దిగుతా' అని ముందుకొచ్చింది. సోషల్ మీడియాలో ఎన్నెన్నో బెదిరింపులు ఎదుర్కొంది.

ఇదే తరహాలో ఇప్పుడు హథ్రాస్ భాదితురాలికి న్యాయం చేస్తానని ముందుకొస్తోంది. అసలైన పోరాటం ఇప్పుడే మొదలైందని సీమా యుద్ధానికి సిద్ధమైంది. నిర్భయ కేసు మాదిరిగానే ఈ కేసులోనూ ఆమె విజయం సాధించాలని, బాధిత కుటుంబానికి న్యాయం జరగాలని ఆశిద్దాం.

జి.గంగాదేవి

# మహిళా చైతన్యం



ఉదయం
5 గం" అలారం
మోగింది.అలారం మోత మోగిందో లేదో దివ్య త్వరత్వరగా లేచి అలారం ఆఫ్ చేసి లేచింది .ఇప్పటి నుండి ఇక పడుకునే దాకా గడియారం లో ముళ్ళు లాగా విశ్రాంతి లేకుండా రోజంతా పనిచేయలి.
చీర కుచిల్లు పైకి చెక్కి ఇంటా భయట శుభ్రం చేసి ఇంటి ముందు కల్లాపు చల్లి ముగ్గు పెట్టి ,స్నానం చేసి వంట ఇంటి వైపు అడుగులు వేస్తూ వెళ్ళింది దివ్య.ఇంతలో అత్త గారి కేక ఇదిగో దివ్య నా టాబ్లెట్స్ కొద్దిగా తెచ్చి పెట్టు ,అంటూ అలాగే అత్తయ్యా అంటూ ఇదిగో అత్తయ్యా అంటూ అందించింది.ఇంతలో భర్త దివ్య కాఫీ....అంటూ కేక ఇదిగో తెస్తున్న నండి అంటూ అటు పరుగులు అత్తగారికి ,మామగారికి,భర్తకు కాఫీ అందించి.పిల్లలు లేవండి స్కూల్ టైమ్ అవుతుంది త్వరగా లేచి బ్రెష్ చేసి పాలు తాగి స్నానం చేసి రెడీ అవ్వాలి లేవండి అంటూ పిల్లల తయారీ.......ఇక వంట ముగించి అందరికీ అన్ని సమకూర్చి గార్మెంట్స్ కి వెళ్ళాలి దివ్య. 8:30 అవుతుంది అని లోపలికి వెళ్ళి త్వరగా లంచ్ బాక్స్ తీసుకుని బయలు దేరింది దివ్య. తన ఉంటున్న వీధిలోనే దివ్యతో పాటు పని చేసేది సుజాత....వెళ్తూ వెళ్తూ తన ఇంటి ముందు ఆగి సుజాత ను పిలిచింది దివ్య ఇదిగో దివ్య వస్తున్నా అంటూ సుజాత పరుగున వచ్చింది. వీళ్ళు పని చేసే గార్మెంట్స్ కి వీళ్ళు ఉంటున్న చోటుకి 2 కిలోమీటర్ల దూరం ఆటో లో వెళ్తే 20 రూపాయిలు ఇవ్వాలి ఆటోకి, నెల అంతా పని చేస్తే అన్ని పోను చేతికి 6వెలు వస్తాయి .ఇక 30 రోజులు ఆటోలో వెళ్తే 12 వందలు ఆటో కి సరిపోతుంది ఇక మనకు మిగిలేది ఏమీ అని వీళ్ళు నడిచే వెళ్తారు.వెళ్తుండగా సుజాత ఇలా అంది....దివ్య ఇంటి పని భయట పని చేయలేక ఉన్నాము,మనకు ఏదైనా వెసులు బాటు ఉంటే బాగుండు అంది. అవును సుజాత..... నేను మొన్న నీతో అన్నాను కదా..... మనం ఒక సంఘం ఏర్పాటు చేసుకుందాం.....అని అవును దివ్య నిజమే అయితే దాని వలన మనకు ఏమి లాభం....అంది చూడు సుజాత .....గార్మెంట్స్‌లో ఎందరో తల్లులు పిల్లల్ని ఇంటి దగ్గర వదిలి వచ్చి బాధతో పని చేస్తున్నారు.వారి బాగోగులు చూసుకో లేకున్నామే అని బాధ పడుతున్నారు. అలాగే మనకు ఇంటి పని ముగించి బయలుదేరితే తిన డానికి కూడా టైమ్ దొరకడం లేదు.ఇలా చాలా సమస్యలు ఉన్నాయి. వీటి అన్నింటికి పరిష్కారం మనమే వెతకాలి అంది.అయితే ఏమి చేద్దాం..... అంది పనిలోకి వెళ్ళాక ...మధ్యాహ్నం భోజనం చేసే టైమ్‌లో అందరినీ ఒకచోట కూడబెట్టి మాట్లాడుదాం..... అంది అలాగే దివ్య.... అంటూ మాటల్లోనే గార్మెంట్స్ వచ్చింది. లోనికి వెళ్ళగానే సూపర్ వైజర్ ఒకటే కేకలు ప్రొడక్ట్ పెంచాలి. గంటకు ఇన్ని ఇవ్వాలి, అన్ని ఇవ్వాలి అంటూ టార్చర్....ఇవన్నీ మామూలే అన్నట్టు పనిలో పడ్డారు.....దివ్య మదిలో ఆలోచనలు మగ వారితో సమానంగా గా పని చేస్తున్నా....ఆడ వారికి ఎందుకు వేతనం తక్కువ......ఇక్కడ పనిచేసే మహిళలలో చాలా వరకు అందరూ అనేక సమస్యలతో బాధపడుతున్నరు. ఈ సమస్యలకు పరిష్కారం దొరక దా.....అంటూ ఎన్నో ఆలోచనతో మనసు లో ఒక యుద్ధమే జరుగుతుంది. మహిళలకు విశ్రాంతి లేదా లేక పోతే మనమే ఎందుకు కల్పించు కోకుడదూ......అంటూ.....ఆలోచిస్తూ ..... అరే పిల్లల బాధ్యత,సంసారం బాధ్యత,ఇంటి పని ,బయట పని అన్ని చక్క పెట్టుకు వస్తున్నా మహిళ శ్రమను గుర్తించి వారికి వెసులు బాటు కల్పించే మార్గమే లేదా......అంటూ ఆలోచనలో ఉండగా .....! సైరన్ మోగించారు భోజనం టైమ్ అయింది .ఇంతలో దివ్య ఆలోచన నుండి తేరుకుని సుజాత భోజనం చేసే చోటుకు అందరినీ చేర్చు ఉన్న 10 నిముషాలు తింటూ మన గురించి సంఘం ఏర్పాటు గురించి చేర్చించు కుందాం .....అంది.అలాగే తినడానికి కూర్చుని సుజాత అందరికీ వీరి ఆలోచన వివరించింది. ఇంతలో దివ్య మనం మన హక్కుల కోసం ముందుకు సాగుదాం....అందరం కలిసి కట్టుగా ఉంటూ.....మన హక్కుల సాధనకై పోరాటం చేద్దాం .....అని చెప్పింది.
రష్యా లో లెనిన్ మహిళల కోసం వారి రక్షణ కోసం వారి హక్కుల కోసం అనేక వెసులుబాట్లు కల్పించారు. ఇంటి పని వంట పని అని మహిళలను అణగదొక్కుతున్నరు అని చెప్పడమే కాదు ఆచరణలో చేసి చూపించారు లెనిన్....అంటూ చెప్పడం మొదలు పెట్టింది.గురజాడ

**(తరువాయి 29లో)**

# ప్రజల ప్రసక్తి లేని.. ప్రజాస్వామ్యం!




> ప్రజలంటే కేవలం ఓటు వేయడానికి మాత్రమే పనికి వచ్చే ఉపకరణాలని, మాటా పలుకు లేని బొమ్మలని బూర్జువా పార్టీల వారి తలపోత. తామిచ్చే డబ్బుకి ఆశపడి ఓటేసేవాడు వారి దృష్టిలో అంతకాక ఇంకెంత!

అమ్మా! ఆశా!..ఎలా ఉన్నారమ్మా మీరంతా! ఎక్కడ చూసినా ఎవరిని కదిలించినా ఏదో దు:ఖపు గూటిలో రెక్కలు ముడుచుకొని కూర్చున్నట్లు మాట్లాడుతున్నారు. అందరి మనసుల్లో తెలీని భయం.. ఏదో అయోమయం.. దిక్కు తోచని గందరగోళం. ఎవరి మీద ఏ నిమిషాన ఈ కరోనా పంజా విసురుతుందో! ఎవరిని మింగేస్తుందోననే అనుమానం.

మొదట మొదట పట్టణాలకే పరిమితమైన ఈ అంతు చిక్కని రోగం పల్లెలకు పాకింది. నిరక్షరాస్యులు, అమాయకులు అయిన గ్రామీణ ప్రజల సాదక బాధకాలు ప్రభుత్వాలకు పట్టవు. ఏ విధమైన వైద్యసదుపాయం లేక, వైద్యమందించే పట్టణాలకు వెళ్లే శక్తి లేక అర్థాంతరంగా ప్రాణాలు వదిలే వారెందరో.

అమ్మా! ఏ దేశంలో అయితే ప్రాథమిక అవసరాలైన విద్య, వైద్యం ప్రజలందరికీ సమంగా అందలేదో అది స్వతంత్ర దేశం అని చెప్పుకోవడానికి అర్హత లేనట్లే! 73 ఏళ్ల స్వాతంత్ర్య ఫలితాలు ప్రజలకు అందనట్లే. అందిచగలిగాం అని ఏ పార్టీ ప్రభుత్వమైనా గుండెల మీద చేయి వేసుకొని చెప్పగలదా! ఇప్పటికీ గర్భిణీ స్త్రీలను రోడ్డు మార్గం లేక డోలీల్లో మోసుకుంటూ, వాగులు, వంకలు దాటుతూ తీసుకొస్తున్నారే! ఈలోగా ఆ తల్లీబిడ్డ ప్రాణాలు 'గాలిలో పెట్టిన దీపాలే' కదా! సరైన వైద్య సౌకర్యం ఉంటే వారెక్కడికో పరిగెత్తవలసిన దుస్థితి ఎందుకు పడుతుంది. ఇవన్నీ మన సోకాల్డు నాయకులకు తెలీని సంగతులా? ఓట్లు వేయించుకోవడానికి వచ్చి అడుక్కొన్నప్పుడు ఇవన్నీ విదితమే కదా! అయినా ప్రతి ఒక్కరూ అధికారపు అందలం ఎక్కి కూర్చోగానే తాను రాజునని, తానెవరికీ జవాబుదారీని కాదని అనుకుంటాడు. ప్రజలకు ప్రశ్నించే హక్కుది? ప్రశ్నతోనే ప్రగతి మొదలవుతోంది. కానీ అది తెలిసినవారెందరు? **ప్రజలంటే కేవలం ఓటు వేయదానికి మాత్రమే పనికి వచ్చే ఉపకరణాలని, మాటా పలుకు లేని బొమ్మలని బూర్జువా పార్టీల వారి తలపోత. తామిచ్చే డబ్బుకి ఆశపడి ఓటేసేవాడు** వారి దృష్టిలో అంతకాక ఇంకెంత! పిచ్చి ప్రజలు ఓటు వేయడంతో తమ బాధ్యత తీరిపోయిందని చేతులు దులుపుకొని నిష్క్రమిస్తున్నారు. ఎవడైనా తెలివితో కంచెం ప్రశ్నిద్దామని, ప్రభుత్వాలను నిలదీద్దామని ప్రయత్నిస్తే వారి నోటికి తాళం వేద్దామని, వాడి అడ్డు ఎలా తొలగించుకోవాలోనని ఆలోచించే గూండాగిరి చేసే ప్రభుత్వాలు రాజ్యమేలే చోట ప్రజాస్వామ్యంవుందని నమ్మగలమా?

ప్రజాస్వామ్యంలో పటిష్టమైన ప్రతిపక్షం, పత్రికాస్వేచ్ఛ, స్వతంత్ర న్యాయవ్యవస్థ ప్రధాన లక్ష్యం. అయితే ఈ మూడు వ్యవస్థలు మృగ్యమయ్యే రోజు వచ్చింది ఇప్పుడు. అధికారంలో ఉన్న పార్టీని ఎన్నుకున్న ప్రజలే ప్రతిపక్షంలో ఉన్నవారిని ఎన్నుకొన్నారనే సంగతి అధికరం చెలాయించే వారు మరచిపోతున్నారు. కేంద్రం నుంచి రాష్ట్రాల వరకు →

# నింగీ, నేల, నీరు.. ఎక్కడైనా పోరాటానికి రెడీ!



ఆ కుటుంబం మూడు తరాలు సైనిక రంగంలో సేవ చేసింది. నాలుగో తరంలోని మహిళ సైనిక రంగంలో ఎంపికై తాత, నాన్న లాగే నేనూ నేవీలో చేరాలి, నేనూ తెల్లటి యూనిఫాం వేసుకోవాలనే ఆమె కల సాకారం చేసుకుంది. ఇండియన్ నేవెల్ అకాడమీలో ప్రాథమిక శిక్షణ మరియు మల్టీరోల్ హెలికాప్టర్ విభాగానికి ఒక మహిళ ఎంపిక కావడం ఇదే తొలిసారి. మార్పు అన్నది నాతోటే మొదలైంది. మేం అబ్బాయిలకు దేనిలోనూ తీసిపోమని నిరూపించా. ఇది సాధించినందుకు నాకెంతో గర్వంగా ఉంది అంటోంది రీతీసింగ్. నేవీలో చేరకముందు ఆ మాట వినగానే సముద్రం నీళ్లు మాత్రమే గుర్తొచ్చాయి. మహిళా ఆఫీసర్ లెఫ్టినెంట్ కిరణ్‌షెకావత్, నేవెల్ ఎయిర్‌క్రాఫ్ట్ ప్రమాదంలో చనిపోయారు. నేవెల్ ఏవియేషన్ వింగ్‌లో చేరి ఈ రంగంలోఉన్న సవాళ్లను స్వీకరించాలని, అప్పుడే నేను గట్టిగా నిర్ణయించుకున్నా. పోరాట సమయంలో నేరుగా పాల్గొనే విభాగంలో ఉండాలనేదే నా కోరిక. నావికాదళం నింగిపైనా, నేలపైనా పని చేస్తుంది. ఈ సవాళ్లను నేను స్వీకరించడానికి సిద్ధమయ్యా. ఈ రంగంలో పరిశీలకుల శిక్షణలో అమ్మాయిలని ప్రత్యేకంగా ఏమీ చూడలేదు. అబ్బాయిలతో సమానంగా మానసిక, శారీరక శిక్షణ తీసుకున్నాం. విధులు నిర్వహించడంలోనూ ఇలాంటి సమానత్వాన్నే చూపిస్తా అంటోంది **కుముదినీ త్యాగి.**

## మహిళలు - చైతన్యం

**(27 తరువాయి)**

అప్పారావు గారు అప్పటి లోనే మహిళల కోసం ఎన్నో రచనలు చేసి మహిళా చైతన్యం కోసం కృషి చేశారు అని చెప్పి. సంఘం ఏర్పాటు చేసింది అన్ని రకాల సమస్యలు ఈ సంఘం ద్వారా పరిష్కరించడం మొదలు పెట్టారు. మగ వారితో సమానంగా పని చేస్తున్నపుడు సమాన పనికి సమాన వేతం ఇవ్వాలి అని,అలాగే ఇక్కడికి వచ్చే మహిళలకి బోజనశాల ఏర్పాటు చేయాలని, పిల్లల సంరక్షణ కోసం చిల్డ్రన్ కేర్ సెంటర్ ఏర్పాటు చేయాలని కోరుతూ నిరసన కార్యక్రమం చేయడం .మొదలు పెట్టారు. ఇలా సంవత్సరం లోగా  ఒక్కొకటే అన్ని చక్క పెట్టుకు వచ్చరు. ఈ ఆలోచన ఒక గార్మెంట్స్ కు మాత్రమే పరిమితం చేయలేదు.ఇలా వీది వీది నా సంఘాలు ఏర్పాటు చేసి మహిళలకు వారి హక్కుల కోసం పోరాటం చేస్తూ......ఎంతో మంది మహిళలకు ఆదర్శం గా నిలిచింది దివ్య.....మహిళా చైతన్యం కోసం కృషి చేస్తూ........

## ప్రజల ప్రసక్తిలేని ప్రజాస్వామ్యం

**(28 తరువాయి)**

సంఖ్యాబలం చూచుకొని విర్రవీగే ఈ ప్రభుత్వాలు ఎక్కడికక్కడ ప్రతిపక్షాలు అడ్డుపతున్నా తమకిష్టమైన బిల్లులను ఆమోదింపజేసుకొని 'మమ' అనిపించుకుటున్నారు. ఈ సందర్భంలో ఓ మహానుభావుడు అన్న మాట మీకు చెప్పాలి. ప్రతిపక్షం అన్నది ప్రషర్ కుక్కర్‌కు సేఫ్టీ వాల్వ్ లాంటిదట. దాన్ని గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది.

**ఇంక మన రోడ్ల దుస్థితి...**

వర్షం వచ్చినప్పుడు ప్రజలు పడే అగచాట్లు.. ఈ మధ్య బాగా వర్షాలే కాదు వరదలు కూడా వచ్చాయి కదా. ఏ రోడ్డు చూసినా గుంటలు, మధ్యలో నీటి చెలమలు కొన్ని రోడ్లపై పెద్ద పెద్ద రాళ్లు పొడుచుకొని వచ్చి భయం గొల్పేలా ఉన్నాయి. సామాన్య జనాల బాధ వర్ణనాతీతం. సరైన డ్రెయినేజీ వ్యవస్థ లేక మురుగునీరంతా ఇళ్లలోకి రావడం, ఉండటానికి, తినడానికి, తాగడానికి దిక్కులేని ప్రజాస్వామ్యం మనది. ఏ నాయకునికైనా ఇటువంటి దుర్భర పరిస్థితుల్లో అనారోగ్యకారకాలైన వాతావరణంలో ఈగలు, దోమల దాడిలో జీవించే పరిస్థితి తెలుసా. స్వీయానుభవం ఉందా? వీళ్లు ప్రజల బీదరికాన్ని ఉచిత పథకాల ద్వారా పారద్రోలతారట.

జనానికి తాయితాలు పంచి మభ్య పెట్టడం మానేసి వారికి సుఖమైన జీవితాన్ని కాకపోయినా కనీస సదుపాయాలతో జీవితాలు ప్రభుత్వాలు ఇవ్వగలగాలి. **ప్రజల మౌలిక అవసరాలు కూడా పట్టించుకోని, నెరవేర్చలేని, ప్రజల కడగండ్లు తీర్చలేని ప్రభుత్వాలు ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఎలా అవుతాయి? అవి కేవలం పార్టీ స్వామ్యాలు మాత్రమే. అది కూడా వ్యక్తి కేంద్రంగా పని చేసేదే.** అధికార లక్ష్యం, ఓటు బ్యాంకు ప్రభుత్వాలే. అమ్మా! ఆశ! ఈ మధ్య మన దేశ రాజకీయాలు, రాష్ట్ర పరిస్థితులు మనసును బాగా కలత పరిచాయి. అందుకే నీతో పంచుకోవాలనిపించింది. నీ అభిప్రాయాలు కూడా తెలియజేయి.

**ఉంటాను రా.. తల్లీ..**

**ప్రేమతో**

**అమ్మమ్మ.**

స్త్రీ లేనిదే జననం లేదు.
స్త్రీ లేనిదే గమనం లేదు.
స్త్రీ లేనిదే జీవం లేదు.
స్త్రీ లేనిదే సృష్టి లేదు.

# మహిళలు మహారాణులు!



పైన చెప్పిన వాక్యాలు స్త్రీలు పడే శ్రమనూ, మహిళల ప్రాముఖ్యతనూ మన కళ్లకు కడుతున్నాయి. స్త్రీ సృష్టి, స్థితి, లయలకు కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సృష్టించింది ఆదిశక్తి అని హిందూ పురాణాలు చెబుతున్నాయి. అంతటి మహోన్నత స్థాయిలో ఉన్న స్త్రీ లేని సమాజం ఊహకందనిది. మహిళల్లేని సమాజం గమనం లేక, చలన రహితమై వినాశనమవుతుంది. మహిళలతోనే ఈ సమాజం ముందుకు నడుస్తుంది. అభివృద్ధి చెందుతుంది. గతంలో స్త్రీలు ఇంటికే పరిమితమైనా, నేడు ఇంటా బయట కూడా విధులు నిర్వహిస్తూ సమాజంలో ముఖ్య భూమికను పోషిస్తున్నారు. నేటి ఆధునిక సమాజం అభివృద్ధి చెందుతున్న సమాజం. ఈ సమాజంలో స్త్రీ గృహిణిగా, వ్యాపారవేత్తగా, ఉద్యోగిగా అనేక రూపాల్లో ఇంటాబయట శ్రమ పడుతోంది. అయితే సమాజంలో మహిళల శ్రమ దోచుకోబడుతోంది. ఇంట్లోవాళ్లు పడే శ్రమ కేవలం ఇంట్లో హాయిగా విశ్రాంతి తీసుకోవడంగానే భావించబడుతోంది. మహిళలు పడే శ్రమకు తగిన మూల్యం చెల్లించబడటం లేదు. వారు పురుషులతో ధీటుగా శారీరకంగా కష్టపడలేరనేది ఒక సాకుగా చూపబడుతోంది. మహిళలు వివాహ అనంతరం ఇంటి బాధ్యత పూర్తిగా స్వీకరిస్తున్నారు. ఇంట్లోని వారందరికీ కావల్సిన అవసరాలు తీరుస్తున్నారు. పండుగలు, ముఖ్యమైన రోజుల్లో ఇంటి శుభ్రత, అలంకరణ వంటి పనులతో రెట్టింపు పని చేస్తున్నారు.

ఇదంతా మహిళ ఒక్కరే చేసే శ్రమ. కొందరు మహిళలు ఇంత శ్రమ పడుతున్నా గుర్తింపు ఉండటంలేదు సరికదా సాధింపులు, చీవాట్లు ఎదుర్కొంటున్నారు. మహిళలు ఇంటి ఇల్లాలిగా ఉదయం లేచింది మొదలురాత్రి నిద్రించే వరకు ఎంతో శ్రమ పడుతున్నారు. అమ్మగా తమ పిల్లలను కంటికి రెప్పలా కాచుకుంటున్నారు. దీనిని వారు శ్రమగా ఎప్పుడూ భావించరు. ఎంతో ఆనందంగా తమ బాధ్యత నిర్వర్తిస్తారు. ఈ శ్రమను గుర్తించి మారుగా వారికొక చిరునవ్వునూ, ఆత్మీయ స్పర్శనూ అందిస్తే మహదానందపడి రెట్టింపు ఉత్సాహంతో పని చేస్తారు అల్పసంతోషులయిన మహిళలు. నేటి సమాజంలో స్త్రీ ఇంటి ఇల్లాలిగానే గాక, వ్యాపార వేత్తగా, ఉద్యోగిగా ఇంకాఅనేక రకాల పనులు చేస్తూ ఇంటా బటయ శ్రమపడుతోంది. పురుషులతో సమానంగా బయట కష్టపడుతూ, సంపాదిస్తూ ఇంటి బాధ్యతను కూడా నిర్వర్తిస్తుంది. ఈ విధంగా శ్రమ పడటం కేవలం మహిళలకే సాధ్యం. అసాధ్యాలను సైతం సుసాధ్యాలుగా చేయగలరు మహిళలు. ఇంటా బయట రెండు బాధ్యతలు నిర్వహిస్తూ విజయబావుటాను ఎగరేస్తున్నారు. ఈ పురుషాధిక్య ప్రపంచంలో అడుగడుగునా అనేక సవాళ్లనూ, సమస్యలనూ ఎదుర్కొంటూ గెలుపు శిఖరాలను అధిరోహిస్తున్నారు. శారీరకంగానూ, మానసికంగానూ ఎంతో ఒత్తిడికి గురవుతూ కూడా ముఖంపై చిరునవ్వును చెదరనివ్వరు. అందుకే మహిళలు మహారాణులు. నత్తగుల్లలోనే ఉండిపోయిన మేలిమిముత్యాలు. మహిళలు ఇంటా బయట నిరంతరంగా, నిర్విరామంగా శ్రమిస్తూ, శ్రమలోనే ఆనందాన్ని అనుభవిస్తూ, శ్రమైకజీవన సౌందర్యానికి నిలువెత్తు రూపాలుగా నిలుస్తున్నారు. వారు అలుపెరుగని శ్రామికులు. భవిష్యత్తు స్వాప్నికులు. ఇంటింటి గృహలక్ష్ములు. సంపాదనలో సార్వభౌములు. మగువలు మణిపూసలు.

# వామపక్ష పాత్రికేయులు 'కావూరి'కి నివాళి

కావూరి వెంకట సుబ్బారావు సోషల్ మీడియాలో (కా.వే.సు.రా)గాను, తెలుగిల్లు వార్తలు విశ్లేషణ పేరుతో పాపులర్ అయిన సుబ్బారావు సోషల్ మీడియాలో తనదైన శైలిలో ప్రగతిశీల శక్తులకు ప్రచారం ఇచ్చిన వ్యక్తి. తను నమ్మిన ఆశయాల కోసం పాటుపడిన శక్తి. ప్రకాశం జిల్లా ఈదుమూడిలో పుట్టి ఒంగోలులో స్థిరపడిన కావూరి వెంకట సుబ్బారావు విద్యార్థి ఉద్యమం నుంచే అభ్యుదయ భావాలను అందిపుచ్చుకున్నారు. ఒంగోలులో యువజన ఉద్యమంలో భాగమయ్యారు. కమ్యూనిస్టు ఉద్యమం పునర్నిర్మాణంలో భాగంగా వై.సిద్దయ్య, జాలా అంజయ్య గార్ల నాయకత్వంలో ప్రకాశం జిల్లాలో యువజనులలో చైతన్యం రగిల్చే ప్రయత్నం జరిగింది. ఒంగోలు యువజన నాయకుడిగా పని చేశారు. **తప్పుచేసిన వారిని ముక్కుసూటిగా ప్రశ్నించేతత్వం సుబ్బారావుది. ఆ కారణం చేతనే అనేక చోట్ల సుబ్బారావు ఇమడలేకపోయారు. భావాల దోషాల నుంచి భాషా దోషాల వరకు ఏ తప్పు జరిగినా నిర్భయంగా ప్రశ్నించేతత్వం సుబ్బారావుది. ఈనాడు నుంచి ప్రజాశక్తి వరకూ ఎక్కడ పని చేసినా ఆయన తన విధానాన్ని కొనసాగించారు.** ఇప్పుడు నడుస్తున్న పెట్టుబడిదారీ విధానపు పాలనపై ఆయన కసితో రగిలిపోయే వారు. జరుగుతున్న ఘటనలపై, పాలక పార్టీల విధానాలపై సోషల్ మీడియా వేదికగా పదునుగా రాసేవారు. పత్రికా భాషను ఎలా రాయాలో చెబుతూనే ఉన్నారు. సోషల్ మీడియాలో



సాంకేతిక విషయాలపై మీడియా బాధ్యులకు సూచనలు ఇచ్చేవారు. సమాజం మార్పుకి మార్క్సిజమే మార్గమని సుబ్బారావు నమ్మారు. సోషలిస్టు శక్తుల విజయాల పట్ల ఆయన విశ్వాసం సడలలేదు. "ఇంట్లో కరోనా వచ్చింది తగ్గింది అంతా బాగుంది" అని విశ్వాసంతో ఉన్నారు. కరోనా వచ్చిన మిత్రులకు సేవ చేశారు. సుబ్బారావు కరోనా మహమ్మారితో చనిపోవటం విచారకరం. గత కొంతకాలంగా చైతన్య మానవి, రైతువాణి పత్రికలకు ఎడిటింగ్ చేస్తూ సహకరిస్తున్నారు. అభ్యుదయ ఉద్యమాలతో మమేకమయ్యే స్వభావమే సోషల్ మీడియాలో చురుగ్గా ఉండటం, మిత్రులకు సహకారంగా ఉండటం అలవాటుగా కొనసాగింది. సోషలిజం విజయం సాధిస్తుందన్న ఆయన ఆశయం జయించి తీరుతుంది. వామపక్ష ఉద్యమాలను బలపరుచుకుంటూ హక్కుల కోసం పోరాడే మన కృషి కొనసాగించడమే సుబ్బారావుకు మనమిచ్చే నివాళి.

## వాల్మీకి పావురం

-కృపాకర్ మాదిగ

మనీషా, మనీషా!
మా బంగారు కూనా!
వాల్మీకి తాత కన్నీటి పావురమా!
నాలుక తెగింది,నీక్కాదమ్మా
నోళ్ళు మూసుకుపోయిన మా అందరికీ
వెన్నెముక దెబ్బతిన్నది నీక్కాదమ్మా
విరిగిపోయింది మా స్వేచ్ఛా శిఖరం
ఛిద్రమయ్యింది,నీ గర్భకోశం కాదమ్మా
మా స్వయం గౌరవతనం
ఆరిపోయింది నువ్వు కాదమ్మా
మన అమ్మ జంబూ ద్వీపమ్మ
గడ్డిని గొడ్లకు వేద్దామనుకున్నవుగానీ
పెట్టాల్సింది,దొరసాన్ల బిడ్డలకే కదంటమ్మా
కొడవలెత్తాల్సింది గడ్డిపరకల కోసం
కాదమ్మా
గడ్డిమేసే మృగాళ్ల మీదకి కదంటమ్మా
ఒకసారి నీ కొడవలి ఇయ్యమ్మా
పౌరుషం కోల్పోయిన మా సాంఘిక
జడత్వాన్ని కోసేసుకుంటాం
ఒకసారి నీ లిక్కి ఇటియ్యమ్మా
గడ్డ కట్టిన మా చీమూ,నెత్తుర్లను
పత్తేసుకుంటాం
బండరాళ్లమని తిట్టుకోకమ్మా
కక్కుబెట్టుకుంటున్న కొడవళ్ళమౌతాం
రెల్లివారి శబరి
మాదిగవారి ఆరంజోతి
పడవ నడిపే పూలన్ దేవి
మాతంగ కన్యలంతా మీటింగులెయ్యాలి
వాల్మీకి వనితలూ,జాంబవ పుత్రికలంతా
జంగు జెయ్యాలి
దొరహంకారాలపై దండోరా వెయ్యాలి
దొరస్వామ్యాలను దునుమాడే
కొంగవాలు కత్తులై లేవాలి

# ధీర వనితలూ.. వందనాలు!

## ఏం జరిగినా సరే..



నువ్వు మాత్రం కెమెరా ఆపకు! అంటూ కెమెరా మెన్‌కు చెప్పి బాధితురాలి ఇంటికి అడ్డదారుల్లో పొలంగట్ల మీదుగా వెళ్లేందుకు విఫల ప్రయత్నం చేసింది. పోలీసులు ఆమెకు అడ్డు తగిలారు. మీ ఇంట్లోనూ ఆడపిల్లలున్నారు. ఒక ఆడపిల్లకు అన్యాయం జరిగితే వెళుతున్నా నన్నెందుకు అడ్డుకుంటున్నారు. ఈ రోజు గాంధీ జయంతి మీరు ఇప్పుడు నన్ను **లోపలికి వెళ్లనీయకపోతే నేను సత్యాగ్రహం చేస్తా అని ఉదయం నుంచి సాయంత్రం వరకు అక్కడే కూర్చుంది. చేతిలో ఫోన్ లాక్కుని కెమెరా అడ్డుకున్నా బెదరలేదు. ఆమె సత్యాగ్రహానికి చివరకు పోలీసులు తలవంచారు. యావత్ భారతదేశం చూపును ఆమె విజయవంతంగా హథ్రాస్ వైపు తిప్పగలిగింది. ఆమే ప్రతిమ.** ముంబైలో పుట్టి ఢిల్లీలో పెరిగిన ప్రతిమ మహారాజ అగ్రసేన్ కాలేజీ నుంచి జర్నలిజం డిగ్రీ అందుకుంది. ట్రాన్స్‌జండర్ల కష్టాలపై మొదటగా ఒక ఆలోచనాత్మక వ్యాసాన్ని ప్రచురించింది. నిర్భయ ఘటనలో ఎంతో చొరవగా అనేక వార్తలను సేకరించింది. గుజరాత్ ఎన్నికలు కవర్ చేయడానికి 2017లో ఒక గ్రామానికెళ్లి అక్కడ కొనసాగుతున్న వర్ణ వివక్షను గమనించింది. ఆ వర్ణ వివక్ష ఎంతంటే కొన్ని కులాల వారికి బావిలో నీళ్లు కూడా తాగే హక్కు లేదు. ఈ కథనాన్ని ఆమె చిత్రీకరించి రామ్‌నాథ్ గోయంక అవార్డును సాధించింది. నేడు హథ్రాస్ ఘటనలో సత్యాగ్రహం చేసింది.

## మీ డ్యూటీ మీరు చేయండి.. మా డ్యూటీ మేం చేస్తాం..



ఈ గొంతు ప్రజ్ఞామిశ్రాది. అర్ధరాత్రి పెట్రోలు, డీజిల్ పోసి ఒక ఆడపిల్ల మృతదేహాన్ని కాల్చడం అనాచారం. పైగా బాధితురాలి కుటుంబ సభ్యులను కూడా రానీయకుండా పోలీసులే వారికి ఆఖరిచూపు కూడా దక్కకుండా అమానుషంగా ప్రవర్తించారు. అసలు బాధితురాలి కుటుంబాన్ని చేరుకోవడమే ప్రజ్ఞాకి చాలా కష్టమైంది. **అతికష్టమ్మీద ఆమె సోదరుడిని దహనం జరిగే ప్రదేశానికి రప్పించింది. వాస్తవాన్ని బయటకు తీసే ప్రయత్నం చేసింది. లఖ్‌నవ్యూకి చెందిన ప్రజ్ఞా ఈ సామాజిక సమస్యలపై పోరాడుతోంది. వీధి నాటకాల ద్వారా ప్రజలను చైతన్యవంతం చేస్తోంది.** ఒక టీవీ ఛానల్‌లో కటింగ్ చాయ్ పేరుతో సామాజిక సమస్యలపై కథనాలు చేస్తోంది. ఈమె నిజాన్ని బయట పెట్టే ప్రయత్నం చేసినందుకు సోషల్ మీడియాలో ఎందరో ఆడపిల్లలు ఈమెకు కృతజ్ఞతలు చెబుతున్నారు. ఉల్టాచెష్మా యూసీ అనే వెబ్‌సైట్ ద్వారా ఈమె ప్రజా సమస్యలపై పోరాడుతోంది.

## చితి మంటలు చిత్రీకరిస్తూ 'తనుశ్రీ' పోరాటం!



అర్ధరాత్రి ఎవరికీ తెలీయకుండా జరిగిపోయే అంత్యక్రియలను చిత్రీకరించిన వీరవనిత. **చనిపోయిన యువతి మృతదేహాన్ని అంబులెన్స్‌లో పోలీసులు బుల్గాడీకి తరలించి ఇంటికి తీసుకెళ్లకుండా పొలాల మధ్యనే ఉంచి కాల్చేస్తున్నారనే వార్త తెలుసుకున్న తనుశ్రీ ఉదయం నుంచీ ఆస్పత్రి వద్దే పడిగాపులు కాసింది. బాధిత కుటుంబంతో చర్చలు జరుపుతున్న పోలీసులపై ఆమెకు అనుమానం కలిగింది. చివరికి అదే నిజమైంది.** దూరం నుంచే తనుశ్రీ గమనిస్తుండగా మృతదేహాన్ని అప్పటికే సిద్ధం చేసిన చితిమీద ఉంచి నిప్పంటించేశారు. ఆ చితి మంటలనే ఆమెను చిత్రీకరించి సాటి మహిళకు జరిగిన అన్యాయాన్ని అందరికీ చెప్పాలనుకుంది. అక్కడే తెల్లారేదాకా ఉండిపోయింది. ఆ చితి మంటలు ఆరతాయేమోగానీ ఆ అభాగ్యురాలి తల్లిదండ్రుల గుండె కోతను తగ్గదు కదా!

# నదిని బతికించుకున్నారు!



**త**మిళనాడులో వేలూరు, తిరువన్నామలై జిల్లాల్లో నాగానది ప్రవహిస్తుందని చూసిన పెద్దలు చెబితే వినడమే గానీ, చూసినవారెవరూ లేరు. బోర్లు వేసి నీరంతా లాగేయడంతో ఎప్పుడో ఎండిపోయింది నాగా నది. దానితోడు వర్షాభావం, కరువు, ఏళ్లపాటు పంటల్లేవు. తిండిలేదు. చాలా కుటుంబాలు వలసపోయాయి. ఉన్నవాళ్లలో కూడా మగవాళ్లు మద్యానికి బానిసలయ్యారు. బిడ్డలను ఏం పెట్టిపోషించాలో తెలీని పరిస్థితి మహిళలది. అలాంటి సమయంలో ఆర్ట్ ఆఫ్ లివింగ్ సంస్థ 'పాలార్ రివర్ రెజువనేషన్ ప్రాజెక్టు' పేరుతో ఒక ఆలోచన వేలూరు జిల్లా మహిళల్లో చైతన్యాన్ని నింపింది. పాలార్ నదికి, నాగా నది ఉపనది ఒకప్పుడు వేలూరు సిరిసంపదలకు, పంటలకు నిలయమైనది. నీటి సదుపాయాల్లేక టమోటా, వేరుశనగ, అరటి వంటి పంటలు పండే భూములను బీడు భూములుగా వదిలేశారు రైతులు. ఆ నదినే మహిళల సాయంతో బతికించే ప్రయత్నం జరిగింది. ఓర్పు, సహనం, సంకల్ప బలం మహిళల్లో నిండుగా ఉంటాయి. అందుకే ఆ పనిని మహిళలకు అప్పగించింది లీ సంస్థ. శాస్త్రవేత్తలు, స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వం, రైతులు, జియో-హైడ్రాలజీ నిపుణులు... మహిళలను కలుపుకొని ముందుకు నడిచాయి. మహిళల పని ఒకెత్తు, వీరందరి పని ఒకెత్తయింది.

**తన భుజాలకెత్తుకుని బాధ్యతగా జలసిరులను వెనుక్కు తీసుకురావడానికి ఉపాధి హామీ ఇచ్చిన భరోసాతో తమ కుటుంబాలను తిరిగి చక్కదిద్దుకున్నారు ఈ మహిళామణులు. 20 అడుగుల లోతుగా నదిపొడుగునా భూగర్భ జలాన్ని పెంచడానికి రీచార్జి బావులను తవ్వారు. ఆ బావుల్లో బరువైన సిమెంట్ రింగ్‌లు అమర్చారు. వీటిని బైట కొనలేదు. ఈపని మహిళా స్వయం సహాయక బృందాలకు అప్పగించారు. సిమెంటు రింగులను పెద్ద పెద్ద తాళ్లు కట్టి వాటిని జాగ్రత్తగా బావిలోకి దింపడం మొదట్లో చాలా కష్టమయ్యేది. అయినా ఇది మగవారికి అప్పజెప్పలేదు.**

నాలుగేళ్లు సాగినా ఈ ప్రాజెక్టులో సుమారు 20 వేల మంది మహిళలు ఉపాధి హామీ సాయంతో ఈ పని పూర్తి చేశారు. వీళ్లిచ్చిన స్ఫూర్తితో నగరాలకు, పట్టణాలకు వలసెళ్లిన కుటుంబాలు తిరిగి వచ్చేశాయి. నదీ పరివాహక ప్రాంతంలో భూగర్భ జలం ఆరు మీటర్లకు పెరిగింది. ఈ నీటిని ఎప్పటికీ కాపాడుకోవడానికి జామ, రోజ్‌వుడ్, మామిడి, ఉసిరి మొక్కలను లక్షల సంఖ్యలో నాటారు. నీటి నిల్వ పెరిగి వ్యవసాయ పనులు మొదలయ్యారు. ఇప్పుడు 5000 గ్రామాల్లో ప్రజలు ఈ లబ్ధిపొందుతున్నారు. దీనికి కారణం వేలూరు మహిళల సంఘటిత శక్తే. వేలాది మంది రైతులకు జలసిరులు కురిపిస్తోందీ నాగానది.



# గాన గంధర్వుడు బాలు!

నా మాతృ భాష సంగీతం. ఏ భాషైనా, ఏ ప్రాంతమైనా, నాకొకటే ధ్యేయం. నేను పాడాలి. సంగీత రసజ్ఞులను ఆనందపరచాలి అంతే. "కళకు భాషా బేధాలు, కులమతాలు అడ్డడం భావ్యం కాదు. నా అన్న జేసుదాసుకు ఇంతవరకూ గురువాయూరులో పాడటానికి అవకాశం రాలేదు. ఇది తలుచుకుంటే మనం భారతదేశంలోనే ఉన్నామా అనిపిస్తుంది. ఒక భక్తుడికి జాతి, మతం చూడాలా? అది అవసరమా? ప్రతిరోజూ దేవుడు అన్న పాటతోనే నిద్ర లేస్తాడు. కానీ ఆ స్వామి దేవాలయంలో అన్నకు పాడే అవకాశమే రాలేదు. పద్మనాభస్వామి దేవాలయంలో కూడా పాడటానికి చాలాకాలం అనుమతి రాలేదు. తరువాత సరస్వతీ పూజరోజు పాడే అవకాశం లభించి పాడి వారి భక్తిని చాటుకున్నారు జేసుదాసు గారు. దేవుడిని ఎన్నో పేర్లతో స్మరించుకుంటాం. మా దేవుడే గొప్ప అనుకోకూడదు. సర్వమత సౌభ్రాతృత్వమే అందరూ చెప్పేది. మాకులం గొప్ప మీది తక్కువ కులం అనుకోవడం తప్పు. మతానికి ఏం కావాలనేది కాదు ముఖ్యం. మనిషిగా బతకడానికి ఏం కావాలనేదే ముఖ్యం" ఈ మాటలు శ్రీపండితారాధ్యుల వారి వంశస్తుడు శ్రీయుతుల బాలసుబ్రహ్మణ్యం గారు తిరుపతిలో జరిగిన సభలో స్వయంగా చెప్పారు. అణకువ, ఆత్మవిశ్వాసం, మర్యాదకు పర్యాదపదమైన బాలూగారు. సినీ జీవిత ప్రస్థానంలో పద్మభూషణ్ అవార్డు పొందారు. సమున్నత ఆదర్శాలు, గొప్ప మానవతావాదం కలిగిన వ్యక్తి. 40వేలకుపైగా 16 భాషల్లో పాడిన ఘనత, ఒకేరోజు 17 పాటలుపాడి రికార్డు సృష్టించిన స్వరం వారిది. ఎందరో కథానాయకులకు తన గొంతు అరువిచ్చి వారి నటనకు సమగ్రతనిచ్చిన స్వరం వారిది. ఎందరో కథనాయకులకు తన గొంతు అరువిచ్చి వారి నటనకు పరిపూర్ణత తెచ్చారు. ఈ స్వరమాంత్రికుడు దశావతారం చిత్రంలో పది పాత్రలకు తన స్వరమే అరువిచ్చారు. తన బాల్యపు మరియు తల్లి జ్ఞాపకమైన నెల్లూరులోని వారి స్వగృహాన్ని కంచి వేదపాఠశాలకు ఎంతో ఇష్టంగా అర్పించారు. మిథునం చిత్రంలో వీరి నటన అద్వితీయం. ఆ చిత్రానికి ప్రత్యేక జ్యూరీ అవార్డు లభించింది. ఎన్నెన్నో బిరుదులు, సత్కారాలు, సన్మానాలు అందుకున్నారు. మృత్యువు కరోనా రూపంలో వచ్చి వారిని కాలగర్భంలో కలిపేసింది. వారికి ఐద్వా ప్రగాఢ నివాళి తెలుపుతోంది.

# ఆ నాట్యం 'శో'భా'యమానం!



నాట్యమంటే ఏమిటో తెలీని, నడకే సరిగ్గా రాని వయస్సున్న కుమార్తెలోని కళని గుర్తించి తల్లి తన పాప వచ్చీరాని నిలకడను నాట్యంవైపు మళ్లించింది. చక్కగా చదువుకోవాల్సిన పిల్ల ఈ డ్యాన్సులేమిటి? అని చుట్టుపక్కల వాళ్లు విస్తుపోయేవాళ్లు. అయినా తల్లి అవేం లెక్కచేయలేదు. ఆ పాపే నృత్యకళాకారిణి డాక్టర్ శోభానాయుడు. ఇటీవలే కన్నుమూశారు. శోభ తండ్రి వెంకన్న నాయుడు నీటిపారుదల శాఖలో ఇంజినీర్. రాజమండ్రిలో ఉండేవారు. మొదట అక్కడే కెవిన్ రెడ్డిగారి వద్ద నృత్యం నేర్చుకుందీమె. వారు అమ్మాయి ఇంకా బాగా నేర్చుకోవాలంటే మద్రాసు తీసుకెళ్లండని సలహా ఇచ్చారు. ఈమెకు నలుగురు తోబుట్టువులు. వారందరినీ ఇంటివద్ద తన తల్లి, భర్త, సంరక్షణలో ఉంచి శోభను ఒక్కదాన్నే తీసుకొని తల్లి మద్రాసు బయలుదేరింది. అక్కడ ప్రముఖ కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ వెంపటి చినసత్యం గారి వద్ద శిక్షణ మొదలైంది. **చిన సత్యంగారి ఆధ్వర్యంలో సరికొత్త ప్రయోగాలు సాగి సత్యభామ, చండాలిక, పద్మావతి, కృష్ణుడు వంటి పాత్రల్లో శోభ ప్రత్యేకత ప్రదర్శించింది.** కళాభిమానుల మనసులు పరవళ్లు తొక్కించింది. ఫెమీనా మ్యాగ్జైన్ కోసం చేసిన ఇంటర్వ్యూలో మొదటిసారిగా ఆమె పేరును తండ్రి పేరుతో కలిపి శోభానాయుడు అని ప్రారంభించారు. చివరి వరకూ పేరు అలాగే స్థిరపడిపోయింది. చండాలిక పాత్ర ద్వారా భారత సమాజంలో కుల వ్యవస్థను అంటరానితనాన్ని తీవ్రంగా ప్రశ్నిస్తూ దానిని కూచిపూడి నృత్యరీతిలోకి మార్చి శోభానాయుడుతో ఆ పాత్ర చేయించారు చినసత్యం. అనేక నృత్యరూపకాలు దేశవిదేశాల్లో అభినయించారు. మనదేశ సాంస్కృతిక రాయబారిగా ఆంధ్రుల కూచిపూడి నృత్యఅభినయాన్ని అంతర్జాతీయ వేదికలపై ప్రదర్శించిన శోభానాయుడు ఇంకా తన సేవలు కళా రంగానికి అందించే శక్తి ఉండగానే కన్నుమూసింది. ఈమె నిష్క్రమణ కళారంగానికి తీరని వెలితి. ఆమెకు ఐద్వా అంజలి ఘటిస్తోంది.

కె.శారద

# లోపాలను దాటుకొని ఆనందపు అంచుల్లోకి..



**మే**డం మీరు నాకు సహాయం చేయాలి. నా పేరు అస్మిత. నాకెవ్వరూ లేరు. నన్ను, నా పాపను మీరే కాపాడండి ప్లీజ్ అంటూ ఆరోజు ఐద్వా అదాలత్‌కు ఆవేశంగా వచ్చింది ఒక యువతి. చూడబోతే ఆకర్షణీయంగానూ, చూడముచ్చటగానూ ఉంది. ఎంతో తెలివిగా ఉంది. ఆమె నుంచి ఫిర్యాదు తీసుకొని ఆమెను కూర్చోమని ఆమెకు కొంచెం నెమ్మదించాక ఐద్వా పెద్దలు అడిగారు. సమస్య ఏంటో చెప్పమని. అస్మిత ఇలా చెప్పింది.

నేనొక అనాథను. నా చిన్నప్పుడే అమ్మా,నాన్న చనిపోయారు. మా పెద్దమ్మ, ఆమె కొడుకు మాత్రమే నాకు బంధువులు. నన్నొక బోర్డింగ్ స్కూల్లో చదివించారు. అదే స్కూల్లో కుమార్ తల్లి వంట చేసేది. ఆమెను నేను ఆంటీ అని పిలుస్తూ చనువుగా ఉండేదాన్ని. నేను, కుమార్ చిన్నప్పటి నుంచి కలిసిమెలిసి పెరిగాం. నా వయస్సుతోపాటు కుమార్‌పై ప్రేమ కూడా పెరిగింది. మా చదువులు అయిపోయాయి. నేను నర్సు ట్రెనింగ్ అయ్యాను. కుమార్ ఎంబిఏ చేశాడు. ఇద్దరం ఉద్యోగస్తులమై కెరీర్ ప్రారంభించాం. నాకు బాగా చనువైన కుమార్‌నే పెళ్లి చేసుకోవాలని, నా ప్రేమ సంగతి, నా నిర్ణయాన్ని, నన్ను చదివించిన సంస్థ వారికి చెప్పాను. వాళ్లు కుమార్‌తోనూ, అతని తల్లితోనూ మాట్లాడారు. అందరూ ఇష్టపడ్డారు. కానీ, గతంలో కుమార్ వేరొక స్త్రీతో రిలేషన్‌లో ఉన్నానని, ఆమె వేరే వ్యక్తిని వివాహం చేసుకుందని ఏమీ దాచకుండా చెప్పాడు. నా నిర్ణయాన్ని మార్చుకోమన్నాడు. సంస్థవారు కూడా ఈ వివాహం వద్దని చెప్పారు. కానీ నేనే నా నిర్ణయం మార్చుకోలేదు. ఇప్పుడామె వివాహిత కదా. కుమార్ ముందే ఈ నిజాన్ని తెలిపాడు. వేరెవరినైనా చేసుకున్నా ఇలాంటివి జరగవని చెప్పలేం కదా. కుమార్ నిజాయతీకి నాకు చాలా సంతోషంగా ఉంది. ఎప్పుడో వారి మధ్య ఉన్న రిలేషన్ ఇప్పుడు నాకు అడ్డంకి కాదు కదా అని చెప్పాను. సంస్థవారు ఇది జీవితం. **నువ్వు సర్దుకొని రాజీపడి పెళ్లి చేసుకోవాల్సిన అవసరం లేదు. పెళ్లి అయిన తరువాత బాధ పడ్డా ప్రయోజనం ఉండదని చెప్పినా కుమార్‌పైన ఉన్న ప్రేమతో వారి మాటలన్నీ తోసిపుచ్చి పెళ్లివైపు అడుగులేశాను.** ఇంక



అత్తగారింట్లో వాతావరణం ఏమంటే.. ఆమెకు నలుగురు సంతానం. వారిలో ఇద్దరు ఆడపిల్లలు. పెద్ద కూతురు చనిపోయింది. ఆమెకు ఇద్దరు సంతానం. వారు తండ్రి దగ్గరే ఉన్నా కానీ ఆ పిల్లలపైన ఈ కుటుంబానికి ఎంతో ప్రేమ. వారి బాగోగులు చూసుకుంటూ ఉంటారు. రెండో కుమార్తె భర్తతో తెగదెంపులు చేసుకొని ఆమె చిన్న ఉద్యోగం చేసుకుంటూ తల్లి దగ్గరే ఉండి తన పిల్లలను పెంచుకుంటోంది. మా అత్తగారు తన కష్టార్జితంతో 50 గజాల స్థలం కొని చిన్న ఇల్లు ఏర్పాటు చేసుకుంది. అందులో 25 గజాలు పెద్ద కుమారుడు తన వాటా కింద ఎప్పుడో తీసుకొని ఇల్లు కట్టుకున్నాడు. ఈ చిన్న ఇంట్లో మా దాంపత్య జీవితం మొదలైంది. సమస్య కూడా అప్పుడే మొదలైంది. మాకు ఏకాంతం ఉండేది కాదు. అలా ఎన్నాళ్లు ఉండాలని ఆలోచించి నేను కుమార్‌తో మనం వేరేగా ఉండైనా వారిని చూసుకోవచ్చు కదా దగ్గర్లోనే ఇంకో ఇల్లు చూసుకుందాం అని అన్నాను. నేను సీనియర్ నర్సును కదా నాకు బాగానే జీతం వస్తోంది. నువ్వూ

సంపాదిస్తున్నావు ఆ మాత్రం ఖర్చు పెట్టలేమా అని అడిగాను. నేను మా అమ్మనీ, తల్లిలేని పిల్లలను విడిచి రాలేనని చెప్పాడు. ఈ కారణంతోటే మా ఇద్దరి మధ్య గొడవలు మొదలయ్యాయి.

**ఈ క్రమంలోనే ఇద్దరూ రుణం తీసుకొని కారు కొనుక్కున్నారు. ఇది ఇద్దరికీ అవగాహనా లోపం. కారు కొనే బదులు ఆ ఇంటిపైన ఒక గది వేసుకుంటే వారి సంసారం చక్కగా సాగేది. కానీ వాళ్లకు ఆ ఆలోచన రాలేదు.** కొన్న కారును బావగారు అవసరమై తీసుకున్నాడు. అస్మిత, కుమార్ బైటకు వెళ్లాలంటే బస్సులో వెళ్లేవారు.

ఇలా ఉండగానే వారికి ఒక పాప పుట్టింది. చిన్న పాపతో నేను బస్సులో రావడమేంటి? నా డ్యూటీ టైమింగ్స్ ఇబ్బందికరంగా ఉంటాయి. ఆ సమయంలో పాపతో బస్సులో వెళ్లడం కష్టంగా ఉంటోంది. సొమ్మొకరిది సోకొకరిది అయింది. నా కారు నాకు కావాలని గొడవ పెట్టుకుంది అస్మిత. ఇది విని కుమార్ వాళ్ల అన్న కోపంతో కారు అద్దాలు పగలగొట్టాడు. కోపంతో అస్మిత నా కారు నా ఇష్టమని అమ్మేసి కారు బాకీ తీర్చేసింది. పంచాయితీలో పెద్దల ఎదుట వీరి సమస్యను ఉంచారు.వారు కుమార్ ఇంటికి దగ్గర్లోనే ఇల్లు తీసుకొని అస్మిత, కుమార్ ఉండాలని చెప్పారు. కానీ, కుమార్ ఒప్పుకోలేదు. తల్లిదండ్రుల్లేకుండా ఒంటరిగా పెరిగిన అస్మిత ఇటువంటి ఇంట్లో ఉండలేక వేరే ఇల్లు తీసుకొని వెళ్లిపోయింది. అప్పుడప్పుడు కుమార్ వెళ్లి పాపను, భార్యను చూసొచ్చేవాడు. ఇలా కొన్నాళ్లు బాగానే జరిగింది. ఇలాగే ఎల్లకాలం ఉంటే అస్మిత ఇక్కడకు రానే రాదు కదా. కుమార్ అర్ధరాత్రి వెళ్లి ఉదయాన్నే వచ్చేసేవాడు. ఇరుగుపొరుగువారు ఇవేమీ తెలియక అస్మితను చులకనగా మాట్లాడేవారు. దీనికి తగ్గట్టుగానే కుమార్ అంతకముందు ప్రేమించిన యువతికి భర్త చనిపోయాడు. పిల్లలతో ఒంటరిగా



జీవిస్తోంది. కుమార్ వెళ్లి ఆమె బాగోగులు చూస్తూ ఉండేవాడు. రానురాను కుమార్ అస్మితతో మాట్లాడేవాడు కాదు. పాపను చూడటానికి కూడా ఎప్పుడో వచ్చేవాడు. తన చెల్లెలి పిల్లల్ని అంత ప్రేమగా చూసేవాడు తన కుమార్తెను ఎందుకు పట్టించుకోవడం లేదు. ఈ ఒంటరి జీవితం మేం భరించలేకపోతున్నాం.

నాకు, నా పాపకు ఎవరూ లేరనే అభద్రతా భావం ఏర్పడింది నాలో. నా బాధను అర్థం చేసుకొని నాకు మంచి జీవితాన్ని అందించండి మేడం అని అడిగింది. ఐద్వా పెద్దలు ఎన్నో ప్రయత్నాలు చేసి కుమార్‌ను రప్పించారు. కుమార్ మాటల్లో జరిగినది ప్రస్తుతం నాకు ఎవరితోటీ ఎటువంటి రిలేషన్ లేదని, భర్త పోయిన ఒంటరి స్నేహితురాలికి కేవలం సహాయం చేస్తున్నానని, నా కూతురు నాకు ప్రాణమని, కాకపోతే అస్మిత నా పాపను నేనే చూసుకుంటాను, నీకివ్వను అని కోపంతో నన్ను తిట్టింది. అప్పటి నుంచే నేను వెళ్లడం తగ్గించా. ఆమె చెప్పింది నిజమే. మా ఇంటి పరిస్థితుల్లో ఆమె ఇమడలేకపోయింది. కానీ ఒక మనసున్న మేన మామగా, కొడుకుగా నేను ఆమె అడిగినట్లు వేరు రాలేకపోయాను.

**మా అన్నయ్యలాగా నేను బాధ్యత వదిలేయలేను. నా కుటుంబం గురించి తెలిసే ఆమె నన్ను కోరుకుంది. ఇప్పుడు నన్ను బాధ్యతలు వదిలి వచ్చేయమంటే ఎలా రాను అని చెప్పాడు.** ఐద్వా పెద్దలు అస్మితకు, కుమార్‌కు విడివిడిగా కౌన్సిలింగ్ చేయించారు. ఎవరికి చెప్పాల్సిన విధంగా వారికి చెప్పారు. ప్రేమ వేరు, పెళ్లి వేరు, పెళ్లితోపాటు భర్త అతని బాధ్యతలు కూడా నీవే అవుతాయి. నీకు, నీ పెద్దమ్మ కొడుకుతో ఎంత బాంధవ్యం ఉందో, నీ కాపురం గురించి వారిద్దరూ నిన్ను తీసుకొని మా వద్దకొచ్చినప్పుడే మాకు అర్థమైంది. మరి నువ్వుకూడా అలా బాధ్యతగా ఉండాలి కదా! నీలాంటి ఒక ఆడపిల్ల ఏవో కారణాలతో భర్తకు దూరంగా ఉంటే వారి పిల్లలను, ఆమెను చూసుకోవడం కుమార్ బాధ్యతే కదా. ఇలాంటి వాటిని నువ్వు అడ్డుచెప్పకు. ఎవరికైనా తన భార్య పిల్లల తరువాతే ఎవరైనా. అది నువ్వు అర్థం చేసుకో అని చెప్పారు. కుమార్‌కు వేరుగా ఉన్నా అమ్మనీ, పిల్లలనూ చూసుకోవచ్చు. అదే ఇంట్లో ఉండాలని లేదు. దగ్గర్లో ఇల్లు తీసుకొని నీ భార్యను, పాపనూ, మీ వాళ్లనూ చూసుకో. భార్య, కూతురు కోసం పగలే ఎంతోకొంత సమయం కేటాయించండి. ఇద్దరూ విద్యా వంతులే. సంస్కారవంతులే. పరిస్థితులే వారిని అలా మార్చాయి. ఇద్దరూ ఆలోచించి ఐద్వా బాధ్యులు చెప్పినదానికి అంగీకరించి ఒప్పందాలు రాసుకొని సంతకాలు చేశారు. వారిద్దరూ ఒద్దికలో పాప హాయిగా పెరుగుతుందని ఆశించి ఐద్వా పెద్దలు వారిని ఆనందంగా సాగనంపారు.

# బతుకెట్టా!




సన్నపురెడ్డి వెంకట్రామిరెడ్డి చేయి పట్టుకోని 'కొండపొలం' బయల్దేరా. ఎలా వుంటుంది కొండపొలం వెళ్తే? నెలరోజులపాటు కొండల్లో జీవించాలి. స్నానం చేసేందుకు నీళ్ళుండవు. స్నానం సరే, కనీసం కాళ్ళు కడుక్కోగలమా? అబ్బే, అదీ కుదరదు. ఎక్కడంటే అక్కడ నీళ్ళు కనబడ్డయ్ గదా అని దిగితే చలిజ్వరం రావడం ఖాయం. పురుగూ పుట్రా ఆలోచన లేకుండా నేల మీదే పడుకోవాలి. ఏ క్షణాన్నయినా క్రూర మృగాలొచ్చి మీద పడొచ్చు. భయపడకూడదు. ఎండా వానలకి ఏ ఆశ్రయమూ ఉండదు. గొర్రెలతో పాటు గొర్రెల్లాగే ఆరుబయట కటిక నేల మీద పడుకోవాల్సిందే. అట్టాంటి కొండపొలానికి బయల్దేరాడు ఇంజనీరింగ్ చదువుకుని ఇంకా ఉద్యోగం రాక అల్లాడుతున్న రవి. తనతో పాటు నేను కూడా బయదేరిపోయా. దాదాపు ఇరవై కుటుంబాల వాళ్ళు కొండకు పోతున్నారు. ఇరవై మందికి పైగా జనం. వెయ్యి దాకా గొర్లు. సజ్జరొట్టెలు, బెల్లం గడ్డ, పచ్చడి ముద్ద, ఉల్లిగడ్డ, బియ్యం - బత్తెం మూటలు భుజానేసుకుని జీవాలకు మేత వెతుక్కుంటూ నల్లమల కొండల్లోకి- పెద పుల్లయ్య, గురప్ప, అంకయ్య, పిచ్చన్న, రాంచంద్ర, పాములేటి, మునెయ్య, తిరిపేలు, రామయ్య, భాస్కర్, శ్రీను, నేనూ. తెల్లారుజామున్నే ప్రయాణం.

సంచిలో అడుగున రెండు శేర్ల బియ్యం పోసి, తర్వాత రొట్టెల మూట, పచ్చళ్ల ముద్దలు, అన్నం వండుకునేందుకు సెరవ వగైరాలు వేసి బత్తెం మూట కడతారు. భుజమ్మీద దుప్పటి, ప్లాస్టిక్ గూడ వేసుకుని, దానిపైన గొడ్డలి కర్రకు సంచి తగిలించుకుని బయల్దేరతారు. కాపోల్ల సుబ్బమ్మ వద్దంటాంటే కందిబేల్లు తెచ్చిపెట్టింది. పప్పుగుత్తికి టేకు కర్రంట తీసకరా వచ్చేప్పుడు గురమ్మ చెప్పింది మొగునితో. ఇంకో గొల్లబోయనికి వెన్నపూస తెచ్చిపెట్టింది కాపోల్ల ఆడమనిషి - కవ్వం కర్ర తెమ్మని. మరొక ఇల్లాలు సద్దలు తెచ్చి ఇచ్చింది - సంగటి గెలికే తెడ్డు కోసం పాలబరికె కర్ర తెమ్మని. "నాయినా! అమ్మికి నెలల్నిండినాయి.పుట్టిన బిడ్డకు పొగ చేయడానికి నెద్ది ఆకులు తెచ్చి. నువ్వు మేనమామ వరసవుతావు. నీ చేతి ఆకులతో పొగేస్తే బిడ్డకు మంచిదంట..మర్చిపోగాకు నాయినా!పున్నెముంటాది" అంటూ ఇంకో ఆడమనిషి గిన్నెతో ఆముదము తెచ్చి ఇచ్చింది మరో గొల్లల ఇంటి పెద్ద.

ఇల్లొదిలి పెట్టి అట్టా మందలంట అడుగు ముందుకేస్తంటే..గురమ్మకే కాదు, నాకూ కళ్ళలో నీళ్లు! చిన్నకొడుకు - ముద్దుల కొడుకు - పనికి నలగని బిడ్డ -నక్క జాడ తెలుసుకోలేని అమాయకుడు - ఈ ఇంజనీరింగ్ పిల్లోడు రవి ఎట్టజేస్తాడో ఏమో!

ఎట్టా ఉంది కొండపొలమనుభవం? నీ పాసుగుల్లా, ఏవని చెప్పాలి. అది 'బతుకు' రా నాయినా. చెబితే తెలుస్తదా? బతికితేనే తెలుస్తది. ఒకట్రెండడుగులు నేనేశానేమో. ఇక ఆ తర్వాత నా సంగతి నాకు తెలీదు. నా ఒల్లు నా స్వాధీనంలో ఉంటే గదా. తోకబోడు, ఎక్కుడుమిట్ట, గోపిదేవి కొండలు, దేవరకొండ, బండపేట్లు, సెలలు, బోడులు ఎక్కీ దిగీ..దిగీ ఎక్కీ మందతో పాటే కొండపొలం జేర్తిని నాకు తెలీకుండానే. వంకలోంచి ఒక్క ఎగురున గట్టు మీదకు దూకింది ఆ జీవి. సరిగ్గా రవికి రెండడుగులు ముందే నేల మీద కాళ్ళాన్చింది. పులో, చిరుతపులో, ఎడగండో అర్థమవకుండానే బేర్ మని అరిచాడు రవి. తనకు తెలీకుండానే అతని ఒళ్ళంతా భయంతో వొణికి పోతాంటే, చేతుల్లోంచి గొడ్డలి కర్ర జారిపోతంటే, తనకు అడుగు దూరంలో తన ఎత్తున లేచి నిలబడి కళ్ళు చింతనిప్పుల్లా జేసి కోరలు బైటపెట్టి అరుస్తూ బావురుమని నోరు తెరిచిన ఆ జీవిని చూసి రవితో పాటు నేనూ కాళ్ళు తడుపుకున్నా.

→

"నీ మిందికి వొచ్చింది పులి కాదు. ఎడగండు. మనిసి మీందకు మార్కొనేంత సత్తవ దానికి లేదు. కోర చూపించి మీద పడే దాని మాదిరి బెదిరిస్తాది. ఆ బెదురులో మనముండగానే గొర్రెను పీకబట్టుకుని ఈడ్సకపోతాది" కొడుకు రవితో చెబ్తున్నాడు గురప్ప. "గట్టిగా అదిలించి నీ చేతిలో ఉన్న గొడ్డేటి కట్టెతో ఒక్క పీకు పీకిన్నేవనుకో, బేర్ మంటా పడుండేది. ఆ సంగతి తెలక బయపన్నెవు" – గురప్ప చెబుతున్నది అడవిలోని ఆ ఎడగండ్లు గురించేనా? **ఎడగండును చూసి పులనుకోని బెంబేలెత్తడం రవొక్కడేనా చేస్తంది? నువ్వూ నేనూ మనందరమూ కూడానా? గొడ్డేటి కట్టెతో ఒక్కటి పీకాల్సిన కాడ వొణుకుతా నిలబడతాంది రవొక్కడేనా? ఈ సన్నపురెడ్డాయన కత చెబుతున్నాడా? బతకటమెట్టాగో నేర్పిస్తన్నాడా?....**

అత్యంత సరళమైన కథ గొర్లను మేత కోసం అడవిలోకి తోల్క పోయి ఒక నెల్లాళ్ళు వాన కుర్సిందాకా అక్కడే ఉండి అప్పుడు ఊరికి రావడం. ఇందులో ఎంత పనితనం చూపెట్టాడో ఈ రచయిత! తల్చుకుంటే అబ్బురంగా ఉంది. ఒక్కొక్క కాపరిది ఒక్కొక్క కథ. అన్ని కథల్లోకీ మనల్ని తీసుకుపోతాడు. **పొద్దున్నే మంద లేవేసుకుని నిలువుకాళ్ల మీద తిరిగి తిరిగీ గొర్ల మేపుకుని సెలలో నీళ్ళు దాపుకుని, ఏ చెట్టు నీడకో జేరి పొవ్వులు పొందించుకోని ఎసట్లో గింజలేసుకుని.. టేకాకుల్లో అన్నం తిని కాస్త ఆగుతారే, అప్పుడల్లా ఆత్రమాత్రంగా ఉత్కంఠగా పరుగులు తీస్తాం అక్షరాల వెంట. ఒక్కొక్కరి బతుకు విప్పే గొల్లల మాటల వెంట. పుల్లయ్య తాత చెప్పే పాఠాల వెంట. చెతుర్ల వెంట, నవ్వుల వెంట, గుండెలు కరిగే కతల వెంట, కన్నీళ్ళ వెంట. నాకైతే నవల చదవడం పూర్తిచేసి పక్కన పెట్టాక కూడా అడవిలోనే ఉన్నట్టుగా ఉందింకా.** పుల్లయ్య తాత, గురప్పలు "నాయినా" అని గుండెకాయల్ని గొంతుగా మల్చి పిలుస్తున్నట్టుగానే ఉంది. "నాయినా, దాని తావుకి మనమొచ్చినాం. మన తావుకది రాలా. అదిక్కడ రాజు. వొస్తే ఒక జీవాన్ని లాక్కుపోతే పోనీండి. పుల్లరి కట్టామనుకుందాం. మనం ఒక్కోలం యాబై పొట్టలు సేత పట్టుకోని వొచ్చిన్నాం నాయినా. కన్ను గలిగి ఉండాల" – తాత నాతోనే ఉన్నాడింకా. నా చెవుల్లో మార్మోగుతున్నాడు. ప్రపంచానికి పర్యావరణశాస్త్రం చెబుతున్నాడు. "పట్టెడు లావు చెట్టు వేరు చూస్సే పామనుకోని బెదిరిపోతివి. వంకలో చెట్లు కదిలితే చాటున మెకము ఉందనుకోని వొణికిపోతివి. ముందుపోడాన్కి జంకితివి, వెనక రాడాన్కి గొంకితివి. నువ్వు గొర్లు కాయడం లేదు సిన్నోడా! నీ బయ్యాన్ని నువ్వు కాసుకుంటా ఉండావు." గురప్ప నాతోనే చెబుతున్నాడు తన కొడుక్కి చెప్పినట్టు. అచ్చమైన టీం స్పిరిట్ అంటే ఏందో అడుగడుగునా కళ్ళకద్దుతుంది. వచ్చిన కష్టాన్ని, సుఖాన్ని అందరూ కలిసికట్టుగా అనుభవించడమంటే ఏందో అర్థమవుతుంది. ఒక జట్టుగా ఉంటే పెద్దపులినైనా ఎట్టా కాచుకోవచ్చో అర్థమవుతుంది. ఛాలెంజీ చేసి చెవుతున్నా. చదివి చూడండి, మీక్కూడా అట్టానే ఉంటది. అడివే మీ ఆలోచనల్లో ఉంటది. ఎండలో, వానలో కూర్చోనూ నిలబడనూ లేకండా మందంట తిరుగుతూ మందను కాపాడుకుంటూ జీవాలను కన్నబిడ్డల్లా సాకే మనుషులు..అవి కడుపునిండా మేస్తే తమ కడుపు నిండినట్టుగా తృప్తి చెందే మనుషులు, అవి తినకుంటే తమకూ పిడచ గొంతు దిగని మనుషులు .. జీవాల గిట్టల్లో విరిగిన ముళ్ళను తమ పళ్ళతో పట్టుకుని పెరికే మనుషులు. మనుషులే నిబ్బా నవల నిండా. మెత్తదనం మాయమవని అచ్చమైన మనుషుల మధ్య తిరగడం, వాళ్లతో కలిసి తినడం, నిద్రపోవడం, గొప్ప మార్దవమైన అనుభూతి.

"మ్మేయ్ సుబద్రా!" అని ఫోన్లో అంకయ్య అరిస్తే అందరితో పాటు నాకూ నవ్వొచ్చింది. కానీ కాసేపటికే అందర్తోపాటు నాకూ ఏడుపొచ్చింది. "అమ్మే! అంతలావు తప్పు నేనేం జేసినా? కండ్లు కనపడని మాయమ్మ కాల్చిన రొట్టెలు బత్తేనికి కొండకు తెచ్చుకుంటే..ఒక పక్క మాడిపోయి, ఇంకోపక్క వెలిరొట్టె పడి కాలక.. – తింటే అరక్క కడుపు నొప్పి, తినకపోతే ఆకల్తో పొట్టనెప్పి – సగం రొట్టెలు కుక్కలకే బేస్నాంటి..పగులంతా పరిక్కాయో ఈతకాయో టూకిపండో మోవిపండో ఈటితోనే పానం పట్టుకోని ఉండానమ్మే. మేయ్ సుబద్రా! ఏవన్న తప్పు జేసింటే అంతకన్నా ఎక్కువే సిచ్చ అనుబగించినా గానీ, ఇప్పుడన్నా ఇంటికి రామే, మూడో బత్తేనికన్నా రా" అరే నాయినా, ఇప్పుడు కళ్లు తుడుచుకుంటున్నది అంకయ్యొక్కడేనా? నీ సంగతేంటీ, నా సంగతేంటీ చెప్పు! సేద్దిగానికి మాత్రం పిల్లనియ్యననే ఇంకో సేద్దిగాడు, కూతుర్ని కాబోయే మేనమావకు పెళ్లికి ముందే తన భార్య అలవాటు చేస్తే, అందుకు దారితీసిన లేనితనం లోంచి కన్నీళ్ళు పెట్టుకునే నిస్సహాయుడు, అల్లుడి కట్నం బాకీ కింద మందను ఇవ్వాల్సొచ్చి గుండె బద్దలు చేసుకున్న పాములేటి కొండకు బయల్దేరుతుంటే వెంట వచ్చి పేరు పేరునా జాగ్రత్తలు చెప్పిన మనిషి, అంత్యక్రియలకి డబ్బులు జేబులో పెట్టుకుని మరీ

**(తరువాయి 42లో)**



# పితృస్వామ్యపు కోరల్లో చిక్కుకున్న మహిళల సామూహిక పొలికేక.. హెల్లారో!

2019 లో వచ్చి, ప్రేక్షకుల్ని అద్భుతంగా అలరించిన అందమైన చిత్రం 'హెల్లారో'. దీని దర్శకుడు 'అభిషేక్ షా'. ఈ సినిమాని గుజరాతీ భాషలో ఇంగ్లీష్ ఉపశీర్షికలతో నిర్మించాడు.

తీవ్రమైన అణచివేతకు గురవుతున్న గుజరాత్‌లోని ఒక గ్రామపు స్త్రీలందరూకలిసి గార్బా అనే వారి సాంప్రదాయపు నృత్యం ద్వారా స్వేచ్ఛా కాంక్షను తెలియజేస్తూ, పితృస్వామ్య బంధనాలనుంచి విముక్తిని కోరు కోవడమే ఈ చిత్ర కథాంశం!

అది గుజరాత్ రాష్ట్రంలోని ఒక మారుమూల కచ్ ప్రాంతంలోని సమర్పురా అనే ఎడారి గ్రామం. ఇందిరా గాంధీ ప్రకటించిన అత్యవసర సంవత్సరం 1975. ఆ గ్రామంలో పురుషులు దాండియా అనే నృత్యాన్ని ఆడి, పాడుతూ గొప్పఆనందాన్నీ, ఆహ్లాదాన్నీ పొందుతూ, సేదతీరు తుంటారు. కానీ స్త్రీలకు మాత్రం అన్నీ నిషిద్ధం. నృత్యం ఆడకూడదు. ఆ మాటకొస్తే అసలు నోరెత్తకూడదు. ఆ గ్రామ మహిళలు కళాత్మకంగా అద్దాలతో అందమైన ఎంబ్రాయిడరీ చెయ్యడాన్ని పురుషులు అనుమతించరు. భర్త తప్పించి ఇతర పురుషులతో సంభాషించకూడదు. ఆ ఊరి మహిళలు వైవాహిక అత్యాచారం, గృహహింస, నిత్య నరకాల మధ్య భారంగా బతుకు లీడుస్తుంటారు. వివేచన లేని మూఢ నమ్మకాలు, కుల నిబంధనలు, కరువు ఆ గ్రామాన్ని పట్టి పీడిస్తుంటాయి. ఇవి గాక అదనంగా మహిళలకు పురుషాధిక్య పీడన, అడుగడుగునా అణచివేత లుంటాయి.

స్థానిక ఎడారి ఒయాసిస్సు నుండి మంచినీటిని గృహావసరాలకోసం తీసుకురావడానికి, ప్రతిరోజూ ఉదయం ప్రతి ఇంటినుంచి స్త్రీలందరూ బిందెలతో బయలుదేరతారు. నిత్య నరకాల మధ్య నుంచి వారందరూ కలుసుకుని కష్టసుఖాలను కలబోసు కోగలగడమే ఆ ఊరి మహిళలకు రవ్వంత ఊరట!

ఈ పరిస్థితుల్లో నవవధువుగా మంజరి అనే యువతి ఆ ఊరికి వస్తుంది. ఆమె భర్త, సైన్యంలో పని చేస్తుంటాడు. **మొదటి రాత్రే ఆమె భర్త తన గ్రామంలో ఉండాలంటే ఆ ఊరి నియమాల ప్రకారం నడుచుకోవాలనీ, అందుకోసం ఆమె రెక్కల్ని, కొమ్ముల్ని వదిలించు కోవలసిన అవసరం ఉందని ఆమెను గట్టిగా హెచ్చరిస్తాడు. లేకపోతే అతనే రెక్కల్ని విరిచి, కొమ్ముల్ని కత్తిరించేస్తానంటాడు.** అంటే ఆమెకు అంతకు ముందు పట్టణ జీవితంలో ఉన్నఅలవాట్లూ అభిరుచులూ అన్నీ మర్చిపోయి ఆ గ్రామంలో ఉండే పద్ధతులూ, ఆచారాల ప్రకారం నడుచుకోవాలని హుకుం జారీ చేస్తాడు! ఒక ఉదయం, మహిళ లందరూ కలిసి, తాగునీటి కోసం చెరువుకు వెళ్ళేటప్పుడు ఒకమనిషి తన ఢోలక్ తో సహా అపస్మారకంగా, అచేతనంగా అక్కడ పడి ఉండడాన్నిమహిళలు చూస్తారు. అతని పేలవమైన స్వరం నుంచి దాహం దాహం అని వినిపిస్తుంది. పరాయి పురుషులతో మాట్లాడకూడదు, గనుక మిగిలిన మహిళలు సందేహిస్తున్న సమయంలో మంజరి మాత్రం అతను దోసిలి పడితే, అతనికి నీరు పోసి దప్పిక తీరుస్తుంది. కాస్త తెప్పరిల్లిన తర్వాత అతన్ని పలకరించి బాగోగులు అడుగుతారు మహిళలు. గార్బా, దాండియా నృత్యాల కోసం డప్పు వాయిస్తూ జీవిస్తాడని తెలుసుకుంటారు. చాలా మంది ఢోలకుల మాదిరిగా, అతను కూడా తక్కువ కులానికి చెందినవాడు. అతను చనిపోయిన తన భార్య, కుమార్తెల బాధాకరమైన జ్ఞాపకాలతో విషాదంగా బతుకు వెళ్ళదీస్తుంటాడు. ముఖ్యంగా తన కెంతో ప్రియమైన, →

అపురూపమైన చిన్నారి కూతురు 'రేవా' తన కళ్ళముందే నృత్యం చేస్తున్నట్లు భ్రమిస్తుంటాడు. మంజరి అతన్ని తమ కోసం డప్పు

వాయించమని అడుగుతుంది. అతను డప్పు వాయించడం మొదలెట్టగానే మహిళలందరూ ఒక్కొక్కరుగా తమ సంకోచాలన్నిటినీ మనసుల్లోంచి పక్కకు నెట్టి, తమ బిందెల్ని పక్కన పెట్టి ఒక్కొక్కరుగా నృత్యం చేయడం ప్రారంభిస్తారు. ఇక ఆరోజు నుంచి ప్రతి ఉదయం నీటిని సేకరించే వారి దినచర్య లయ విన్యాసాల నాట్యంతో వారి జీవితాలను ఆనందాల హరివిల్లే చేస్తుంది!

ఈ చిత్రం ఆ గ్రామ మహిళల వ్యధాభరితమైన జీవితాలకు చెందినది. మనం జీవిస్తున్న ఈ కాలం ఇప్పటి ప్రపంచం నవ నాగరికమై పోతుందని, స్త్రీలందరూ ఆధునికతను సంతరించుకుంటున్నారనీ ఊదర గొడుతుం తుంటుంది ప్రపంచం. కానీ మహిళల్ని అన్ని దేశాల్లో ఆక్టోపస్ లా పట్టుకొని పీడిస్తున్న పితృస్వామ్యం మాత్రం చెక్కుచెదరడం లేదనీ, పురుషాధిక్య ప్రపంచంలో ఏ మార్పూ రావడం లేదని ఈసినిమా తెలుపుతుంది. **ఈ సినిమా కథ 1975 సంవత్సరానికి చెందినదైనా ఇప్పటికీ, 21 వ శతాబ్దంలో కూడా చాలా మంది గ్రామీణ మహిళల జీవితాల వాస్తవికత ఇదే! పురుషుల ఆలోచనల్లోని అనాగరిక స్థితిని చూపుతుందీ సినిమా!**

సమ్మోహనం గావించే సకల వర్ణాల వస్త్రధారణలతో, సమ శ్రుతి లయలతో, డప్పు కనుగుణమైన మనోహరమైన నృత్యాలతో, మధుర స్వర సమ్మేళనాలతో మహిళలు దొరికిన ఆ కాస్తంత సమయంలో తమ జీవితాలకు తామే అధిపతుల మన్నట్లు ఈ లోకాన్ని మర్చిపోయి నిర్జీవంగా, నిర్మానుష్యంగా ఉండే ఆ ఎడారి ప్రాంతాన్ని తమ ఉనికితో దివ్యంగా వెలిగిస్తారు! ఈ స్త్రీలు నాట్యాన్ని తమకోసం తాము జీవించే ఒక హక్కుగా పరిగణిస్తారు.

నీటి

> **"మీ డప్పు శబ్దాల రాగాలాపనల, సమతాళాల కనుగుణంగా నాట్యం చేసే ఆ కాస్త సమయంలోనే రోజులో మేము సజీవంగా ఉంటున్నాం. చనిపోతామనే భయంతో దాన్ని ఆపడానికి సిద్ధంగా లేము" అని మంజరి ముల్జీతో అన్న మాటల్లో ఈ చిత్ర సారాంశమంతా దాగి ఉంది!**

కోసం వెళ్ళి నాట్యం చేస్తున్నారని మంజరి భర్త అర్జన్ ద్వారా భర్తలకు తెలిసి పోయినప్పుడు, వారి చేతుల్లో స్త్రీలందరూ విపరీతంగా దెబ్బలు తిని గాయపడతారు. అయినా

నృత్యం చేస్తారు. మహిళలలో ఒకరు "ఈ నాట్యం కోసం నేను నా జీవితాన్నైనా వదులుకోవడానికి సిద్ధంగా ఉన్నాను" అని అనడం ఆ ఊరి మహిళలు ఎంతగా నిర్బంధంలో మగ్గిపోతున్నారో తెలుస్తుంది. "మీ డప్పు శబ్దాల రాగాలాపనల, సమతాళాల కనుగుణంగా నాట్యం చేసే ఆ కాస్త సమయంలోనే రోజులో మేము సజీవంగా ఉంటున్నాం. చనిపోతామనే భయంతో దాన్ని ఆపడానికి సిద్ధంగా లేము" అని మంజరి ముల్జీతో అన్న మాటల్లో ఈ చిత్ర సారాంశమంతా దాగి ఉంది!

ఈ మహిళలు వారి గ్రామంలో ఉన్న నియమ నిబంధనలనూ, పరమ మూర్ఖత్వంతో కూడుకున్న ఆచారాలనూ ధైర్యంగా సవాలు చేసి ఎదుర్కొన్న తీరు ఎవరికి వారు చూచి తీర వలసిందే!

సరళమైన కథే గానీ కథనాన్ని 'అభిషేక్ షా' తన దర్శకత్వంతో శక్తివంతంగా తీర్చిదిద్దారు. వినగానే సంభాషణలు ప్రేక్షకుల గుండెల్ని హత్తుకుంటాయి. అద్భుతమైన నాట్య ప్రదర్శనలు, హృద్యమైన సంగీతంతో మిళితమై ప్రేక్షకుల్ని మైమరపించి శాశ్వత ప్రభావంతో ముద్ర వేస్తాయి.

అభిషేక్ షా తన తొలి చిత్రం ద్వారానే ప్రేక్షకుల్ని విశేషంగా ఆకట్టుకున్నారు. ప్రారంభ దృశ్యంలోనే పురుషులు ఆనందంగా ఆరు బయట దాండియా నృత్యం చేస్తుంటారు. స్త్రీలు తమ ఇళ్ల నుండి చాలాసేపు దీనంగా, విభ్రాంతిగా ఆశగా ఆ నాట్య ప్రదర్శనల్ని చూసే సన్నివేశం ద్వారా ఈ చిత్ర స్వభావాన్ని సెటప్ లోనే సముచితంగా సూచిస్తారు. "మంగీ లేజే సప్నా వినా ని ఖలీ రాత్" అనే పాట నేపథ్యంలో వినిపిస్తున్నప్పుడు అర్జన్, తన భార్య మంజరి నుంచి ఇక ఆగలేనట్లు సెలవు తీసుకోవడం, చివరి సన్నివేశంలో ముల్జీ తన కుమార్తె గురించి ఆలోచిస్తూ, ఆ పాపని తల్చుకుంటూ "నాచ్ రేవా, హావ్ తారి వారీ" అంటూ డప్పు వాయించడం

ప్రేక్షకుల మదిలో స్పష్టంగా నిల్చిపోయే కొన్ని సన్నివేశాలు. అభిషేక్ చిత్ర దర్శకుడుగా, నిర్మాతగా తన విలువనూ, నైపుణ్యాన్నీ నిరూపించుకున్నాడు.

అన్ని అడ్డంకులను అధిగమిస్తూ అసమానతలతో పోరాడే మహిళల కథలతో ఇంతకుముందు చాలా చిత్రాలొచ్చాయి . కానీ సమర్పురా గ్రామ మహిళల స్వేచ్ఛకు వ్యక్తీకరణ

రూపంగా నృత్యాలను ఉపయోగించడం సరికొత్త తాజా విషయం. అభిషేక్ షా చాలా తెలివిగా పితృస్వామ్యం, కులతత్వం, గుడ్డి విశ్వాసాల సంకెళ్ళను విచ్ఛిన్నం →

చేయడానికి ధైర్యం చేసే మహిళలకు ఈ చిత్రం ఒక దృశ్యకావ్యమే!

తారలందరూ తమ పాత్రలలో ఒదిగిపోయి తమ ప్రతి ఫ్రేం లోని చిన్న చిన్న బిట్ లు కూడా వాస్తవికంగా కనిపించేలా నాట్యం చేసి స్క్రీన్ మీద మెరిసిపోయారు. ముఖ్యంగా మంజరి పాత్రలో నటించిన శ్రద్ధా దంగర్ చేసిన ప్రదర్శనలు చాలా ఆకర్షణీయంగా ఉండి ప్రేక్షకులను విపరీతంగా ఆకట్టుకుంటాయి! ఈ మహిళలు దూరంగా నడిచొస్తున్న లాంగ్ షాట్లు సకల వర్ణ శోభితంగా ఉండి ప్రేక్షకులను మాయ చేసే వశీకరణ మంత్రమేదో తెలిసినట్లు అయస్కాంతంలా ఆకర్షించి ప్రేక్షకులను రెప్ప వెయ్యనివ్వవు. పురుషుల నాట్యాలు కూడా చాలా ఉత్తేజకరంగా ఉంటాయి. కానీ ఈ నటీమణుల అపూర్వమైన నాట్యాలు వారి పురుష సహచరులను ప్రేక్షకుల దృష్టి నుండి కనుమరుగు చేసి తెర వెనక్కి నెట్టేస్తాయి! వారు నిజజీవితంలో కూడా నాట్యంలో నైపుణ్యం కలిగినవారై ఉండి ఉంటారు!

ఈ తారలే కాకుండా ముల్జీగా నటించిన జయేష్ మోర్, అర్జన్ గా నటించిన అర్జవ్ త్రివేదీ గ్రామంలోని ఏకైక ప్రగతిశీలవ్యక్తిగా భాగ్లో పాత్రలో మౌలిక్ నాయక్‌తో సహా మిగిలిన నటులందరూ ప్రదర్శించిన అద్భుత నటనలు ఎంతైనా ప్రశంసించదగినవి!

ఈ పురుషులందరి నటనా ఒకెత్తయితే, చాలా ప్రధానంగా జయేష్ మోర్ నటన గురించి చెప్పుకోవాలి. 'పోస్ట్ ట్రామాటిక్ స్ట్రెస్ డిజార్డర్' (పి టిఎస్‌డి) అనే మానసిక వ్యాధితో బాధ పడుతున్నట్లుగాఫ్లాష్‌బ్యాక్‌ల లోకి వెళ్ళి ఈ లోకంలో లేని తన పాపను కళ్ళెదుట ఉన్నట్లుగా భావించి దప్పు ఉద్వేగంగా వాయించడం, తక్కువ మాటలతో, ఎక్కువ నటనతో తీవ్రమైన ఆందోళనకు గురవుతున్నట్లుగా తన ఆహార్యంలోనూ, హావ భావాల లోనూ అమోఘంగా పలికించారు. జయేష్ మోర్ కి స్వయంగా ధోల్ ఆట తెలుసు గనక కొన్ని ముఖ్యమైన సన్నివేశాల సమయంలో ప్రదర్శించిన అనుభూతితో ప్రేక్షకులను ఉత్కంఠ శిఖరాలకు చేరుస్తాడు!

## సాధించిన అవార్డులు

*66వ జాతీయ ఉత్తమ చలన చిత్ర అవార్డును గెలుచుకుంది. ఈ గౌరవం పొందిన మొట్టమొదటి గుజరాతీ చిత్రమిది. ఈ చిత్రంలో నటించిన 13 మంది మహిళా నటీమణులు కూడా వారి నటనకు స్పెషల్ జ్యూరీ అవార్డును గెలుచుకున్నారు! ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్ ఆఫ్ ఇండియాలో ఇది ప్రారంభ చిత్రంగా ఎంపికైంది!*

ధోలక్ వాయిద్యం, పల్లెటూరి గుజరాతీ నాట్యాలే ఈ చిత్ర ఘన విజయానికి కారణమయ్యాయి. వారిని ఎంచుకోవడంలోనే ఈ దర్శకుడి ప్రతిభ తెలుస్తుంది. గుజరాత్ రంగుల ప్రపంచాన్నీ, భారతీయ సంస్కృతిని గొప్పగా ప్రదర్శిస్తూ, మరి ఈ అసమానతలూ, పితృస్వామ్యాల సంగతేమిటని బలంగా ప్రశ్నిస్తారు.

సినిమా దృశ్యకావ్యం కాబట్టి అందులోని ప్రతి వస్తువూ, ప్రతి అంగుళం మాట్లాడు తుందనడానికి నిదర్శనంగా చిన్న చిన్న వివరాల పట్ల శ్రద్ధ చూపడం సినిమా అందానికి తోడ్పడింది. ఉదాహరణకి మహిళలందరూ ఉపయోగించిన ఇత్తడి బిందెలు అన్నీ ఒకే పరిమాణంలో ఒకే ఆకారంలో అందంగా ఉంటాయి. నృత్యం చేస్తున్న మహిళలకు ఒక పక్కన ఫ్రేం లో బిందెలన్నీ అందంగా కనిపిస్తాయి. ఇక వాళ్ళ ఇళ్ళు ఎంతో కళాత్మకంగా ఉంటాయి. ఆ మహిళలు చేతుల్తో కుట్టిన వస్త్రాలు, మట్టితో అలికిన ఇళ్ళు, అలంకరించుకున్న రంగు రంగుల కళాకృతుల అందం ఒక కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరిస్తాయి. పురుషులు స్త్రీలు తయారు చేసిన రంగు రంగుల సుందరమైన కచ్ వర్క్ ఎంబ్రాయిడరీ వస్త్రాలన్నిటినీ భోగి మంటల్లోకి విసిరేసినప్పుడు, ప్రేక్షకుల ప్రాణాలు ఉసూరుమంటూ నిట్టూరుస్తాయి.

ఈ చిత్రంలో ద్వంద్వాత్మక వైరుధ్యాలు జంట నక్షత్రాల్లాగా మెరుస్తూ కనిపిస్తాయి. అంటే మంచి - చెడు, గ్రామీణ జీవితం - పట్టణ జీవితం, అగ్ర కులం - అట్టడుగు కులం, పురుషులు - మహిళల మధ్య ఘర్షణల్ని స్పష్టంగా చూపించారు. పురుషులు కత్తులతో దాండియా నృత్యం చేస్తారు. మహిళలు అరచేతులతో కొట్టుకుంటూ మనోహరంగా నృత్యం చేస్తారు. ఇది స్త్రీ-పురుష సంబంధాల్లోని అసమానతల్ని, పురుషుల కరుకుదనాన్నీ, స్త్రీల సున్నితమైన మానవత్వపు కోణాన్నీ సంకేతంగా సూచిస్తుంది. మంజరి నాయకత్వంలోని ఈ 13 మంది నటీమణులు తమ అద్భుతమైన ప్రదర్శనలతో నటనలో ప్రతి పురుష నటుడినీ అధిగమిస్తారు.

జయేష్ మోర్ మాత్రమే వారి నటనకు ధీటుగా నిలుస్తాడు!

**మూడు సంవత్సరాలుగా వర్షాలు లేక అంబాదేవి అనే దేవతను** ప్రసన్నం చేసుకోవడానికి వర్షం

**కోసం పురుషులు నృత్యం చేస్తారు. ఒక స్త్రీ అనుగ్రహం కోసం తపిస్తూ తమ ఇంటి స్త్రీలను కించపరిచే ఆ ఊరి పురుషుల అజ్ఞానాన్ని ఎదురెదురుగా అద్దంలో చూపినట్లు చూపిస్తారు అభిషేక్ షా.**

త్రిభువన్ బాబు సాదినేని సినిమాటోగ్రఫీ కచ్ ప్రాంతపు విస్తారమైన, బంజరు భూముల ప్రకృతి రమణీయ దృశ్యాల్ని మరింత అందంగా కనబడేలాచేస్తాయి. ముఖ్యంగా క్లైమాక్స్ సీన్ లో స్త్రీల ప్రతి కదలికలో స్వేచ్ఛా భావన ఉల్లాసంగా ప్రతిధ్వనిస్తుంది. పురుషుల దాండియా కూడా అందమైన ఆహార్యాలతో చక్కటి టెంపోతో మనోహరంగా సినిమా ప్రారంభ సన్నివేశంలో ఉంటుంది. ఈ సన్నివేశాల కోసం నైపుణ్యంతో కూడిన కొరియోగ్రఫీ వాస్తవమైన భావోద్వేగాలను ప్రతిబింబించేలా రూపొందించబడింది. మెహుల్ సుర్తి సంగీతంతో, ఆదిత్య గాధవి స్వరం ఈ చిత్రాన్ని మరింత మురిపిస్తుంది. ఈ సినిమా సంభాషణల రచయిత కూడా అయిన సౌమ్యా జోషీ పాటల సాహిత్యం-మాటల సాహిత్యం మధ్య గొప్ప అల్లికను సమకూర్చింది.

ఒక రకంగా చెప్పాలంటే, ఈ చిత్రం పైకి పేరులో పితృస్వామ్యం పైన ఆగ్రహాన్ని ప్రదర్శిస్తున్నప్పటికీ అభిషేక్ షా తెలివిగా ఈ చిత్ర కథనాన్ని మాత్రం ఆనందపు ఆవిష్కరణగా ప్రేక్షకుల మనసులకి తాకేలా దృశ్యీకరించారు. ఉద్రిక్త క్షణాల మధ్య సూక్ష్మ హాస్యం చొప్పించి ప్రేక్షకుల మానసిక స్థితిలో మార్పు తెచ్చి ఆహ్లాదాన్ని కలిగిస్తుందీ చిత్రం. పరిష్కరించాల్సిన సమస్యలను ఆకర్షణీయమైన నృత్యం ప్రదర్శనల ద్వారా బలంగా నొక్కి చెప్తూ ప్రేక్షకుల హృదయాల్లో గొప్ప రసాస్వాదననీ, ఉత్తేజాన్నీ కలిగిస్తూ వారిని ఆలోచించమని విజ్ఞప్తి చేస్తారు అభిషేక్ షా! క్రెడిట్స్ రోలవుతున్నప్పుడు ఆ తర్వాత కూడా థియేటర్‌లో నిశ్శబ్దం రాజ్యమేలడం చాలా అరుదుగా కనిపిస్తుంది. అలా జరిగిందంటే ఆ చిత్రం సినీ ప్రేమికుల హృదయాలను కదిలించిందని నిర్ధారించుకోవచ్చు.

**హెలారో**
**అంటే గుజరాతీ భాషలో విస్ఫోటనం అని అర్థం. పెరుగుతున్న ఉష్ణోగ్రతల మధ్య ఈ మహిళలు కాళ్ళకు చెప్పులు లేకుండా డ్యాన్స్ చెయ్యడమంటే వారు విముక్తి కోసం హాహాకారాలు చేస్తున్నారని ప్రేక్షకులకు చెప్పడమే!**

హెలారో అనే భావోద్వేగం గుండెలు పిక్కటిల్లేలా పెనుకేకలు వేస్తున్నట్లుంటుంది!!

మొత్తం మీద హెలారో అపురూపంగా, రమణీయంగా, అందంగా రూపుదిద్దుకున్న చిత్రం. భారతీయ సినిమాకు ఒక పదునైన కథను అందించింది. మంచి సినిమా కోసం తపించిపోయే వారూ, ఇంటిల్లిపాదీ కలిసి చూడాలనుకునేవారూ తప్పక చూడదగిన అపురూపమైన చిత్రం!

---

### బతుకెట్టా
### (38 తరువాయి)

అప్పుల బాధకు పురుగుమందు తాగిన నారాయణ - అరే బాబా, చుట్టూ పరచుకున్న జీవితం రా నాయినా! ఇది ఒట్టి నవల కాదు! కాలికింద పడిన వేరు చూసి, ఎడగండును చూసి కాళ్ళు తడుపుకున్న రవి పెద్ద పులికి ఎదురు నిలబడి దాని తలను బద్దలుగొట్టి తరిమేసేవాడుగా ఎట్టయ్యాడు? అది చావకూడదని ఎందుక్కోరుకున్నాడు? దాన్ని కొట్టాల్సొచ్చినందుకు ఎందుకు సిగ్గుపడ్డాడు?ఎవరికి వాళ్ళు చదివి తెల్సుకోవాల్సిందే. కతని స్థలకాలాలతో కలపడానికి వర్తమానంతో కలిపాడుగానీ, అది నాకనవసరమబ్బా. అడవిలోకెళ్లి, అడవి లోంచి బయటకొచ్చిందాకే నా నవల. నా కొండపొలం. - మరి మీరూ చూస్తారా కొండపొలం? అచ్చమైన జీవితానుభవానికి మాత్రం నేను హామీ.

# ఇదేనా బిజెపి సభ్యత?

## సంస్కార హీనంగా యూపీ ఎమ్మెల్యే వ్యాఖ్యలు

తల్లిదండ్రులు తమ కుమార్తెలకు సభ్యత, సంస్కారం నేర్పితేనే అత్యాచారాలకు అడ్డుకట్ట పడుతుందని యూపీకి చెందిన బిజెపి ఎమ్మెల్యే సుంద్రసింగ్ తమ అమూల్యమైన సలహాలను ఆడపిల్లల తల్లిదండ్రులకు ఇచ్చారు. ఇలాంటి ఘటనలను మంచి విలువలతోనే అడ్డుకోవచ్చు. శాసనాలు లేక ఆయుధాలతో అడ్డుకోలేం. తమ కుమార్తెలను సంస్కారవంతమైన వాతావరణంలో పెంచుతూ సరైన పద్ధతులు బోధించడం తల్లిదండ్రుల విధి. రక్షణ కల్పించడం ప్రభుత్వ ధర్మం అయనప్పుడు తమ చిన్నారులకు విలువలను బోధించడం కుటుంబాల బాధ్యత. ప్రభుత్వం మంచి విలువల కలయికతోనే దేశం అద్భుతంగా మారుతుందని వారు చెప్పారు. మరలాంటి సంస్కారం కొడుకులకు అక్కర్లేదు.

పట్టణ ప్రాంతాల్లో..

# ఉపాధి పథకం ద్వారా పనులు కల్పించాలి

## ఆగస్టు 28న కేంద్ర కమిటీ పిలుపు మేరకు ప్రజా సంఘాల ఆందోళన

**మునిసిపాలిటీ, పట్టణ ప్రాంతాల్లో ఉపాధి హామీ పథకం ద్వారా పనులు లేని ప్రజలకు పనులు కల్పించాలని ప్రజా సంఘాల ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళనలు జరిగాయి. కేంద్ర కమిటీ పిలుపులో భాగంగా ఈ ఆందోళనల్లో పలుచోట్ల నిరసన ప్రదర్శనలు సాగాయి.**

**మహిళలకు ఉపాధి, ఆరోగ్యం కల్పించాలని, హింసను అరికట్టాలని, అఖిల భారత మహిళా సంఘాలు పిలుపునిచ్చాయి.** విజయవాడలో పాత ప్రభుత్వ ఆసుపత్రిలో వైద్య సౌకర్యాలు మెరుగు పరచాలని కోరుతూ నిరసన కార్యక్రమం జరిగింది. రెండు


విజయవాడలో...

సార్లు జరిగిన కార్యక్రమాన్ని ఉద్దేశించి ఐద్వా రాష్ట్ర, జిల్లా కార్యదర్శులు, డి.రమాదేవి, కె.శ్రీదేవి మాట్లాడారు. డాక్టర్ల కొరత చాలా తీవ్రంగా ఉందని వెంటనే డాక్టర్లను నర్సులను నియమించాలని వైద్యాధికారులను కోరారు. పిఒడబ్ల్యు, ఎన్ఎఫ్ఐడబ్ల్యూ రాష్ట్ర కార్యదర్శులు దుర్గా భవానీ, గంగా భవాని పాల్గొని ప్రసంగించారు. టి.ప్రవీణ్ మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం పత్రికా ప్రకటనలు తప ఆచరణలో నిధులు మాత్రం విడుదల చేయటం లేదని కరోనా సమయంలో సరైన వైద్యం అందక ప్రైవేట్ ఆస్పత్రులకు వెళు న్నారని వేలాది రూపాయలు ప్రజలతో ప్రభుత్వమే ఖర్చు పెట్టిస్తోందని అన్నారు. ఈ కార్యక్రమంలో మహిళా సంఘం నాయకులు గాదె ఆదిలక్ష్మి ఝాన్సీ,పాలవెల్లి, షకీలా ఎస్ కే ఆశ యువజన ఎస్ కె నిజాముద్దీన్ సంఘం నాయకులు రమేష్ పాల్గొన్నారు. ● అల్లూరిసీతారామరాజు వంతెన వద్ద ఆరోగ్య కేంద్రాన్ని సందర్శించి అక్కడ ఉన్న సమస్యలపై ఐద్వా ఆధ్వర్యంలో ధర్నా చేశారు. ఆశ మాట్లాడారు. రమణి,వీరలక్ష్మి, బేబీరాణి, రాజశేఖర్, అజయ్‌కుమార్ పాల్గొన్నారు. కాకినాడ జిజిహెచ్‌లో గర్భిణులకు వైద్యం అందించాలనిఆ రక్తహీనత, బీపీ తదితర సమస్యలున్న వారిని గతంలో మాదిరి ఆసుపత్రిలో చేర్చుకోవాలని ధర్నా చేశారు. అనంతపురం, గుత్తిలో 5 ప్రాంతాల్లో వైద్య సదుపాయాలు మెరుగుపరచాలని ధర్నాలు చేశారు.

**ఆత్మకూరు:** పట్టణంలోని గొల్లవీధిలో మహిళలపై జరుగుతున్న దాడులను అరికట్టాలని, పట్టణ ప్రాంతాల్లో ఉపాధి హామీ పథకం ద్వారా పనులు కల్పించి వ్యవసాయ కూలీలను ఆదుకోవాలని కోరారు. ఐద్వా పట్టణ నాయకురాలు మంజుల, మీనమ్మ, అక్కమ్మ, పుల్లమ్మ లక్ష్మి, రజిత, మహాలక్ష్మి పాల్గొన్నారు.

● **పిడుగురాళ్ల :** మహిళలపై హింసను నిరసిస్తూ తహసీల్దార్ కార్యాలయం వద్ద మహిళా సంఘం ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమంలో దేవల్ల భూలక్ష్మి మాట్లాడారు. ప్రతి కుటుంబానికి 7500 రూపాయలు నగదు ఇచ్చి ఆదుకోవాలని ఆమె డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో తెలకపల్లి కృష్ణవేణి, గుర్రం కొండమ్మ, రమాదేవి, దేవమణి, ఫాతిమా, కుమారి పాల్గొన్నారు. ● **కాకినాడ :** తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో, అమలాపురంలో 4 టౌన్ సచివాలయాలలో 5 గ్రామ సచివాలయాలలో వినతిపత్రాలు ఇచ్చారు. ●**తిరుపతి :** ఆలిండియా కమిటీ పిలుపు మేరకు ఐద్వా, పీఓడబ్ల్యూ మహిళా సమాఖ్య


పాత గుంటూరులో...

ఆధ్వర్యంలో పోస్టు ఆఫీస్ వద్ద నిరసన చేపట్టారు. ● ఆటోనగర్‌లో ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో నిరసన జరిగింది.


రామభద్రాపురంలో...

● **పాత గుంటూరు** శ్రామిక నగర్, శివాలయం వీధిలో ఐద్వా ఆధ్వర్యంలో నిరసన పట్టారు. ●**వినుకొండ :** పశ్చిమ గుంటూరు జిల్లా వినుకొండలో మద్యం షాపులను వెంటనే మూసివేయాలని నిరసన కార్యక్రమం నిర్వహించారు. ●**పార్వతీపురం జిల్లా** బొబ్బిలి మండలం రంగరాయ పురం పంచాయతీలో ఐద్వా ఆల్ ఇండియా కమిటీ పిలుపు మేరకు మద్యం నియంత్రించాలని, నిత్యావసర సరుకులు ఇవ్వాలని గృహహింసను అరికట్టాలని నిరసన చేపట్టారు.

●**నంద్యాల :** నంద్యాలోని సబ్ కలెక్టర్ కల్పనా కుమారికి వినతిపత్రం ఇచ్చారు.


కర్నూలులో...




# ఉన్మాదంపై కన్నెర్ర!

- హథ్రాస్ ఘటనపై నిరసనల వెల్లువ
- నిందితుడిని కఠినంగా శిక్షించాలి
- యోగి ప్రభుత్వంపై ఎస్సీ, ఎస్టీ అట్రాసిటీ కేసు పెట్టాలని ప్రజాసంఘాల డిమాండ్

**ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని హథ్రాస్ జిల్లాలో 19ఏళ్ల మనీషాపై జరిగిన హత్యాచారానికి నిరసనగా మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు భగ్గుమన్నాయి. నిందితులను కఠినంగా శిక్షించాలని అందరూ ముక్తకంఠంతో నినదించారు. నిరసన ప్రదర్శనలు చేశారు. పలుచోట్ల కొవ్వొత్తులు వెలిగించి బాధితురాలికి నివాళి అర్పించారు. ఘటనలో విధి నిర్వహణలో అత్యంత బాధ్యతారహితంగా వ్యవహరించిన పోలీసు, ఇతర అధికారులను ఉద్యోగాల నుంచి తొలగించాలని, కఠినంగా శిక్షించాలని డిమాండ్ చేశారు. అలాగే ఆ యువతి కుటుంబానికి పూర్తిస్థాయి భద్రత కల్పించాలని, జస్టిస్ వర్మ కమిషన్ సిఫారసులను అమలు చేయాలని కోరారు. ఘటనలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన యోగి ఆదిత్యనాథ్ రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు.**

● సిఐటియు, ఎఐకెఎస్, ఎఐఎడబ్ల్యుయు, ఐద్వా సంఘాలతో కూడిన ప్రతినిధి బృందం హథ్రాస్ జిల్లా గుల్‌గర్హి గ్రామాన్ని సందర్శించి, బాధిత యువతి కుటుంబాన్ని పరామర్శించింది. అనంతరం ఈ ప్రతినిధి బృందంలోని సభ్యులు మీడియాతో మాట్లాడారు.

● తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో కొవ్వొత్తుల ర్యాలీ నిర్వహించారు. ఐద్వా, జామాయితె ఇస్లామీ హింద్ ఉమెన్ వింగ్,ఆర్.కె.పి ఉమెన్ వింగ్, ఎస్ఎఫ్ఐ, జెవివి, ఇతర ప్రజాసంఘాలు కలసి అంబేద్కర్ భవనం నుంచి కలెక్టర్ కార్యాలయం మీదుగా ఇంద్రపాలెం లాక్ వద్ద అంబేద్కర్ విగ్రహం వరకు ప్రదర్శన చేశారు.




● నూజివీడు పట్టణ కమిటీ ఆధ్వర్యంలో మహిళలపై దాడులు పరిష్కార మార్గాలుపై ఆన్లైన్‌లో సదస్సు జరిగింది. ముఖ్య వక్తలుగా గవర్నమెంట్ మహిళా జూనియర్ కాలేజి కెమిస్ట్రీ లెక్చరర్ రత్న మణి, కృష్ణ యూనివర్సిటీ అసిస్టెంట్ ప్రొఫెసర్ స్రవంతి ప్రసంగించారు.

### మహిళల రక్షణ కోసం డిమాండ్లు

● మహిళా రక్షణకు ప్రభుత్వాలు చట్టాలను చిత్తశుద్ధితో అమలు చేయాలి. ● పురుషాహంకార భావజాలాన్ని రూపుమాపాలి. ●పాఠశాల స్థాయి నుంచే బాలికలకు ఆత్మరక్షణ విద్య ఒక సబ్జెక్టుగా చేర్చి, నేర్పాలి. ● మద్యాన్ని నిషేధించాలి. ●అశ్లీల వెబ్‌సైట్లను, యాప్‌లను నిషేధించాలి. ● ఫాస్ట్‌ట్రాక్ కోర్టులు విస్తృతంగా ఏర్పాటు చేసి నేరస్తులను వెంటనే కఠినంగా శిక్షించాలి. ● పాఠశాలలు, కళాశాలల్లో నైతిక విలువలతో కూడిన విద్యను బోధించాలి.

● బొబ్బిలిలో రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించారు. ఉపాధ్యాయ, కార్మిక, మహిళా, విద్యార్థి, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో హథ్రాస ఘటనపై నిరసన కార్యక్రమం చేపట్టారు. దళితులపైనా, మహిళలపైనా జరుగుతున్న దాడులనూ, అత్యాచారాలనూ అరికట్టాలని డిమాండ్ చేశారు.




● ఎటపాక మండలం తుమ్మలనగర్ గ్రామంలో ఐద్వా మండల కమిటీ ఆధ్వర్యంలో మహిళలు కొవ్వొత్తుల ప్రదర్శన చేశారు. ● బొబ్బిలి మండలం పిరిడి గ్రామంలో అంగన్‌వాడీ ఎండిఎం ఐద్వా నిరసన కార్యక్రమం చేశారు. ●పార్వతీపురం పట్టణం, బెలగం హరిజన వీధి, టౌన్ వేములకోట వారి వీధిలలో కూడా నిరసన చేపట్టారు.

● ప్రజాసంఘాల ఆధ్వర్యంలో కాకినాడ కల్పనా సెంటర్ వద్ద ప్రజల నుంచి సంతకాల సేకరణ చేస్తూ కరపత్రాల పంపిణీ చేశారు. ●పార్వతీపురం జిల్లా రాంభద్రాపురంలో యోగి రాజీనామా చేయాలని రౌండ్‌టేబుల్ సమావేశం నిర్వహించారు. రాస్తారోకో చేపట్టారు. ఐద్వా, సిఐటియు శ్రామిక మహిళా సంఘం నాయకులు కుమారి పార్వతీ,




శ్యామల, భవాని, పుణ్యవతి, రవణమ్మ, లక్ష్మి, బలస శ్రీను, ఇందిర పాల్గొన్నారు. • చిత్తూరు జిల్లా వాల్మీకిపురంలో ప్రజా సంఘాల ఐక్యవేదిక ఆధ్వర్యంలో చంద్రావతి అధ్యక్షతన రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించారు. రేష్మా, రబాణి, శ్రీవాణి, యశోదమ్మ, శ్రీదేవి పాల్గొన్నారు •పశ్చిమ గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో ప్రజా సంఘాల ఆధ్వర్యంలో రౌండ్‌టేబుల్ జరిగింది. చిలక చంద్రశేఖర్, జ్ఞాన్ పాల్ రాజ్, జి మల్లేశ్వరి, ధరణికోట విమల, విజయ్ కుమార్, అనుముల లక్ష్మీశ్వరరెడ్డి, గద్దె ఉమ శ్రీ, నలమోతు సుందరయ్య,




మామిడి వెంకటేశ్వరరావు పాల్గొన్నారు • విజయనగరంలో కోట దగ్గర నుంచి మూడు లాంతర్లు వరకు కొవ్వొత్తులతో ర్యాలీ నిర్వహించారు. ఈ ర్యాలీలో వి.లక్ష్మి, వి.రమణమ్మ, జి అప్పలసూరి, ఎం జగన్మోహన్ పాల్గొన్నారు. •సీతానగరం మండలం లచ్చయ్యపేటలో 13, 14 వార్డుల్లో నిరసన కార్యక్రమం జరిగింది. •పార్వతీపురం జిల్లా బొబ్బిలిలో 14, 13వ వార్డులో అంగన్వాడీల ఆధ్వర్యంలో నిరసన జరిగింది. • గజపతినగరంలో రాస్తారోకో జరిగింది. •మదనపల్లిలోని విజయనగర్ కాలనీలో నిరసనలో గంగాదేవి, భాగ్యమ్మ, శ్రీనివాసులు హరీంద్రనాథ్ శర్మ, స్థానిక మహిళలు, విద్యార్థినులు పాల్గొన్నారు. అంగన్వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ •యూనియన్ పార్వతీపురం ప్రాజెక్టు కమిటీ, ఐద్వా ఆధ్వర్యంలో నిరసన తెలిపారు. భగత్ సింగ్ కాలనీలో క్యాండిల్ ర్యాలీలో భగత్ సింగ్ నగర్ అభివృద్ధి కమిటీ నాయకులు వెంకటయ్య, రామకృష్ణ, మహిళా సంఘం నాయకులు శంకరమ్మ, రత్నమ్మ, నీలావతి, విద్యార్థిసంఘం నాయకురాలు సాహితీ పాల్గొన్నారు. • కృష్ణా జిల్లా విస్సన్నపేట స్థానిక అంబేద్కర్ సర్కిల్‌లో కోపల్లి జయకర్, కుమార్, లక్కీ పోగు పురుషోత్తం, రంగా,రాణి, ఉమా రత్న, నాగరాజు, ఆకుల శ్రీనివాసరావు, సూరి రాజు మాస్టర్, మాజీ సర్పంచ్ పల్లెపాలెం లక్ష్మయ్య పాల్గొన్నారు. • విజయవాడలో ఆందోళన చేశారు. •విజయనగరం జిల్లా గంట్యాడ మండలం కోటారిబిల్లిలో నిరసన జరిగింది. • అమలాపురం గడియార స్తంభం సెంటర్‌లో నిరసన కార్యక్రమం జరిగింది. ఉభయ గోదావరి జిల్లాల గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీ ఇళ్ల వెంకటేశ్వరరావు ఉభయ గోదావరి జిల్లాల టీచర్స్ ఎమ్మెల్సీ రాము సూర్యారావు పాల్గొని మాట్లాడారు.




• కర్నూల్ పాత బస్టాండ్ అంబేద్కర్ సర్కిల్ ముందు నిరసన కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమాన్ని ఉద్దేశించి ఐద్వా ఓల్డ్ సిటీ కార్యదర్శి బంగి పద్మ, ఐద్వా జిల్లా ఉపాధ్యక్షురాలు పిఎస్ పద్మ మాట్లాడారు. కార్యక్రమంలో జయమ్మ, కమ్రాన్ బి, అమీనాబి, ధనలక్ష్మి, ఎత్తులక్ష్మి, మహేశ్వరి, జహరాబి, బద్రీ ఉనీసా, పద్మ, చేపల బువ్వమ్మ పాల్గొన్నారు. • పశ్చిమ గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో యోగి ప్రభుత్వంపై చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో ఎస్ఎఫ్ఐ రాజేశ్వరి, తేజ ఐద్వా వెంకటరత్నం, ఫరీద, జయలక్ష్మి, రాజేశ్వరి,




ఉషా పాల్గొన్నారు. • నంద్యాలలోని ప్రభుత్వ హస్పటల్ ఎదుట కొవ్వొత్తుల ప్రదర్శన చేపట్టారు. డి.హుస్సేన్ భాష, రత్నమ్మ, నిర్మలమ్మ, నిరంజన్ మాట్లాడారు. • నెల్లూరు టౌన్ 49వ డివిజన్ సంతపేట స్థానిక ఐద్వా కమిటి ఆధ్వర్యంలో కొవ్వొత్తుల ప్రదర్శన జరిగింది. •నెల్లూరు రూరల్ 25వ డివిజన్ బృందావనకాలనీ జాతీయ రహదారిపై కొవ్వొత్తులు వెలిగించి మృతురాలికి నివాళి అర్పించారు. • ప్రకాశం జిల్లా ఒంగోలు, కందుకూరు, మద్దిపాడు, ఎస్ఎన్‌పాడు మండల కేంద్రాల్లో నిరసన జరిగింది. • వినుకొండలో కొవ్వొత్తుల ప్రదర్శన జరిగింది. ఈ కార్యక్రమంలో రంజాన్ బి తిరుమల లక్ష్మి నా సర్ బి ఇంకా తదితరులు పాల్గొన్నారు

# మితిమీరిన హింస, పోర్ను వెబ్‌సైట్లను

# నిరోధించాలి

అత్యాచారాల వ్యతిరేక పోరాట వేదిక పిలుపులో భాగంగా ప్రజాసంఘాల ఆందోళనలు


నంద్యాలలో..


తాళ్లరేవులో..

సెప్టెంబరు 8వతేదీన విజయవాడలో 21 సంఘాల ఆధ్వర్యంలో రౌండ్‌టేబుల్ పిలుపులో భాగంగా 13న రాష్ట్ర వ్యాప్తంగా నిరసన కార్యక్రమాలు జరిగాయి. దేశవ్యాప్తంగా ఇచ్చిన పిలుపులో భాగంగా సిఐటీయూ, రైతు సంఘం, వ్యవసాయ కార్మిక సంఘం, ఐద్వా, కెవిపిఎస్, డివైఎఫ్ఐ, ఎస్ఎఫ్ఐ, యూటీఎఫ్, ఆవాజ్, ఎపిడికెయస్, ఇతర ప్రజాసంఘాలు కలిసి 13న రాష్ట్ర వ్యాప్తంగా భారీగా నిరసనలు చేపట్టాయి. మహిళలపై దాడులకు పితృస్వామ్య పాలన, సినిమాలు, పోర్ను వెబ్‌సైట్లు, సీరియళ్లతో తీవ్ర ప్రభావం చూపసాయని, వీటితోపాటు తల్లిదండ్రులు ఆడపిల్లలను చూసే విధానంలోనూ మార్పు రావాలని ప్రజాసంఘాలు పేర్కొన్నాయి.

● నెల్లూరు రూరల్ 31వ డివిజన్‌లోనూ నిరసన జరిగింది. జగ్గయ్యపేట మండలం షేర్ మహమ్మద్ పేటలో ప్రజా సంఘాల ఆధ్వర్యంలో రాస్తారోకో చేసి యూపీ సీఎం యోగి ఆదిత్యానంద్ దిష్టిబొమ్మ దహనం చేశారు.

● కర్నూలు జిల్లా పరిషత్ కార్యాలయం ముందు వున్న గాంధీ విగ్రహం వద్ద, ప్రజా


కర్నూలులో..

చేపట్టాయి.

కెవిపిఎస్

దళిత మహిళా సంఘం జిల్లా నాయకులు విజయమ్మ అధ్యక్షతన జరిగిన నిరసన కార్యక్రమాన్ని ఉద్దేశించి రాధాకృష్ణ, అలివేలమ్మ, ఆనంద్ బాబు, గౌస్ దేశాయ్, గురుశేఖర్, నారాయణ, నగేష్, సుభాన్, సత్యం,వెంకటేష్, రాజగోపాల్, నరసింహులు, కిరణ్మయి, పద్మ, జయమ్మ, రాఘవేంద్ర, గురు స్వామి, సోమన్న, అంజి బాబు, సాయిబాబా, చిన్నవ్యాపారుల సంగం, భవన నిర్మాణ సంగం నాయకులు పాల్గొన్నారు.

● కర్నూలు జిల్లా, బేతంచెర్ల మండలం, బలపాలపల్లె గ్రామంలోని దళిత పేటలోని దళిత మహిళలతో రాత్రి 9 గంటలకు కొవ్వొత్తులతో నిరసన జరిగింది. ఈశ్వరయ్య మాట్లాడారు. ఎం.జయమ్మ,డి. నాగమ్మ, ఆర్.వెంకటలక్ష్మి, పార్వతి, సుగుణమ్మ పాల్గొన్నారు.

● విజయవాడ వాంబేకలనీలో జరిగిన నిరసనలో సరోజ, ఝాన్సీ, ప్రవీణ్, నిజాం, ఓ.మను నంధన్, ప్రసాద్, భార్గవ్, ప్రవీణ్, జీవన్, పూజా, ఐద్వా నాయకులు దేవీ, కనకదుర్గ, విజయ, అఖిల్, బొంగు పాల్గొన్నారు.

● గుంటూరులో అత్యాచార వ్యతిరేక పోరాట వేదిక ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమం శంకర్ విలాస్ సెంటర్‌లో జరిగింది.

● పెద్దాపురం, తాళ్లరేవులలో ప్రజాసంఘాల ఆధ్వర్యంలో మానవహారం నిర్వహించారు.

● ఐక్య వేదిక ఆధ్వర్యంలో తూర్పుగోదావరి జిల్లా ఎర్రబోలు గ్రామంలో మానవహారం నిర్వహించారు. యూపీ ప్రభుత్వ దిష్టిబొమ్మ దహనం చేశారు. ● గజపతినగరంలో కార్యక్రమం జరిగింది. కర్నూలు న్యూసిటీ కమిటీ పరిధిలోని సుందరయ్య సర్కిల్‌లో ప్రజా సంఘాలు నిరసన తెలిపాయి.

### మహిళలపై దాడులు నివారించాలంటే..

●మహిళలు సమైక్యంగా, సంఘటితంగా ఉండాలి. ●కుటుంబం, సమాజం, విద్యాలయాలు ఈ మూడు కూడా ఆడపిల్లలు, మగపిల్లలు సమానం అని తోటివారిపై ముఖ్యంగా ఆడవారిపై హింస క్షమించకూడదు. ●మానసిక హింసలు ప్రోత్సహించే సీరియళ్లు చూడటం మానేసి ఆపదలప్పుడు ఎలా సంరక్షించుకోవాలి అని నేర్పే కార్యక్రమాలను ప్రోత్సహించాలి. ●అత్తవారింటికి వెళ్లేదానివి సౌమ్యంగా ఉంటూ అంటూ శారీరకంగా మానసికంగా చిన్నప్పటి నుంచే బలహీనురాలిని చేస్తున్నారు. అలా కాకుండా మగ పిల్లలని ఎంత దృఢంగా ఉండాలని చెబుతామో అలాగే ఆడపిల్లలకు నేర్పాలి.



విశాఖలో.

# 'గళమెత్తుదాం'

## మహిళా సమస్యలపై ప్రజా సంఘాల పిలుపు

**దేశవ్యాప్త నిరసనల్లో భాగంగా ఐద్వా, ఎన్ఎఫ్ఐడబ్ల్యూ, పీఓడబ్ల్యూ, మరియు 500 సంఘాల ఆధ్వర్యంలో 'రాజ్యాంగాన్ని పరిరక్షించుకుందాం! ప్రజాస్వామ్యాన్ని కాపాడుకుందాం! గొంతెత్తుదాం! గళం విప్పుదాం!' అంటూ నిరసన కార్యక్రమం చేయడం జరిగింది.**

సెప్టెంబరు 5న గౌరీలంకేష్ తృతీయ వర్థంతి సందర్భంగా విజయవాడ వాసవ్య మహిళా మండలి ప్రాంగణంలో జరిగిన కార్యక్రమంలో కీర్తి, రష్మి, రమాదేవి, దుర్గాభవానీ, గంగాభవానీ, మాలతీ పాల్గొన్నారు. ఐద్వా, ఎన్ఎఫ్ఐడబ్ల్యూ, పీఓడబ్ల్యూ, మహిళా మిత్రలు పాల్గొని నిరసన తెలిపారు. దీనికిముందు వివిధ సంఘా నాయకులతో జరిగిన వెబ్‌నార్‌లో ఆంధ్రయూనివర్సిటీ విశ్రాంత ఆచార్యులు నిర్మల పాల్గొన్నారు. విజయవాడ సుందరయ్య నగర్ వద్ద జరిగిన కార్యక్రమంలో కె.దుర్గ, పద్మ, జి. ఝాన్సీ, కార్యదర్శి పి.రాణి, తమ్మిన.దుర్గ, ఆష, దేవికుమారి,పుష్ప, వి.లక్ష్మి, యల్. జ్యోతి పాల్గొన్నారు. రాజమండ్రి ప్రాంతంలో బొమ్మూరు, రాజోలు, వేమగిరి, కడియం, మోరంపూడి, లాలాచెరువు, నిడిగట్ల, ధవళేశ్వరం ప్రాంతాల్లో జరిగిన నిరసనలలో అంగన్‌వాడీ, ఆశా కార్యకర్తలు, విద్యార్థినులు, బాలబాలికలు పాల్గొన్నారు. విశాఖ నగర కమిటీ వెబినార్ నిర్వహించింది. ఈ వెబినార్‌లో ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు ప్రభావతి, జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు, సత్యవతి, ప్రియాంక, ప్రముఖ న్యాయవాది జవహర, రాజు, కుమార్ పాల్గొన్నారు.


అనంతపురంలో..

● నెల్లూరు రూరల్ పరిధి 24, 25, 26, 30, 33, 5 డివిజన్లలో సుందరయ్యనగర్, బృందావనకాలనీ, భగత్ సింగ్ కాలనీ, విఎంఆర్‌నగర్, బైకాస్ రోడ్ ,స్థానిక ఐద్వా కమిటీల ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమాలు జరిగాయి. అనంతపురం, గుంటూరు, తిరుపతి, మదనపల్లి, కెవిబిపురం,పెద్దబయలు, అరకు, నర్సాపురం, నంద్యాలలో కూడా నిరసన తెలిపారు.




## డ్వాక్రా మహిళలకు

# ఉపాధి కల్పించాలి

కర్నూలు సుందరయ్య భవనంలో ఐద్వా నగర కార్యదర్శి అరుణ ఆధ్వర్యంలో స్వయం సహాయక సంఘాల సభ్యుల సదస్సు నిర్వహించారు. ఈ సదస్సును ఉద్దేశించి ఆన్లైన్లో జాతీయ నాయకులు పుణ్యవతి మాట్లాడారు. శ్రామిక మహిళా సంఘం జిల్లా కార్యదర్శి నిర్మల మాట్లాడారు. ఎన్.అలివేలు, పుణ్యవతి, కిరణ్‌మయి, బి. పద్మ, కె.ఎస్.పద్మ, ఎం. ఉమా ,క్రమున్ బీ పాల్గొన్నారు. ●ఆర్పీల నియామకాలను మెప్మా గైడ్ లైన్స్ ప్రకారం చెయ్యాలని, పొదుపు మహిళలపై రాజకీయ వేధింపులు ఆపాలని నెల్లూరు కలెక్టర్ కార్యాలయం ఎదుట ఐద్వా ఆధ్వర్యంలో ధర్నా జరిగింది. అనంతరం కలెక్టర్ గారికి అర్జీ సమర్పించారు. ●ఐద్వా నెల్లూరు నగర కమిటీ ఆధ్వర్యంలో 53, 54 డివిజన్ల పొదుపు మహిళల సమస్యలపై మెప్మా ఆఫీస్ వద్ద ధర్నా నిర్వహించి మెప్మా పీడీకి వినతిపత్రం సమర్పించారు. షేక్. మస్తాన్ బి, మహ్మదా పద్మ షకీలా పాల్గొన్నారు. ●విశాఖనగరలో జోనల్ ఆఫీస్ దగ్గర ధర్నా జరిగింది. జి లక్ష్మి రాధ, శేషారత్నం గ్రూపు నాయకులు సిహెచ్ విజయ, కుసుమ పాల్గొన్నారు. ●తిరుపతిలో డ్వాక్రా సంఘాల సమస్యల గురించి సంఘ సభ్యులతో సమావేశం జరిగింది. ●విజయవాడ వాంబే కాలనీలో టైలరింగ్ శిక్షణ ఇచ్చి సగం ధరలకే కుట్టు మిషన్ పంపిణీ జరిగింది.

### డిమాండ్లివీ..

●పొదుపు సంఘాల్లో సభ్యులకు ఉపాధి అవకాశాలు కల్పించాలి. ●పొదుపు మహిళలు అవసరాల కోసం వెళితే వారి నుంచి కమిషన్లు ఇప్పించాలని కొంతమంది అధికారులు ఒత్తిడి చేస్తున్నారు. వైఎస్సార్ ఆసరాలో జరుగుతున్న అవినీతిపై పీడీ, కలెక్టర్ స్పందించి అవినీతిని అరికట్టాలి. ● తక్షణమే అన్ని గ్రూపులకూ రుణమాఫీ చేయాలి. ●వడ్డీ మాఫీలో పొదుపు మహిళలు కట్టే దానికి ప్రభుత్వం ఇస్తున్న దానికి సంబంధం లేకుండా ఉంటోంది. కాబట్టి వడ్డీ మొత్తాన్ని ప్రభుత్వమే ఇవ్వాలి.




## కార్మిక హక్కుల కోసం ...

హిందూపురం తూముకుంట పారిశ్రామికవాడలో సిఐటియు అనంతపురం జిల్లా దక్షిణ కమిటీ హిందూపురం ఆధ్వర్యంలో గార్మెంట్స్ కార్మికులకు జీతాలు పెంచాలని భారీ ధర్నా జరిగింది. కరోనా నేపథ్యంలో తొలగించిన కార్మికులను విధుల్లోకి తీసుకోవాలని టెక్స్ పోర్ట్ గార్మెంట్స్ గేటు ఎదుట జరిగిన ఆందోళనలో సిఐటియు దక్షిణ ప్రాంత జిల్లా కమిటీ సభ్యులు నరసింహ, బాబావలి, హిందూపురం సిఐటియు ఉపాధ్యక్షులు అత్తర్ బాబా,వేలాది మంది గార్మెంట్స్ మహిళా కార్మికులు పాల్గొన్నారు.

**కార్మికుల ప్రధాన డిమాండ్లు**

(1) కార్మికులకు వేతనాలు పెంచాలి

(2) బోనస్ సౌకర్యం కల్పించాలి

(3) కరోనా నేపథ్యంలో కార్మికులకు బస్ చార్జీలు తగ్గించాలి.

●దేశవ్యాప్త పిలుపు లో భాగంగా అంగన్వాడీ నెల్లూరు నగర కమిటీ ఆధ్వర్యంలో ప్రాజెక్టు ఆఫీసు వద్ద నిరసన కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమాన్ని ఉద్దేశించి అంగన్వాడీ అర్బన్ ప్రాజెక్టు కార్యదర్శి షేక్. మస్తాన్ బి మాట్లాడారు. అంగన్వాడీ లను ప్రభుత్వ ఉద్యోగులు గా గురించాలని,సెంటర్ అద్దె బకాయిలను వేంటనే చెల్లించాలని, రేషన్ సరుకులను సెంటర్‌లకు సరాఫరా చేయాలని డిమాండ్ చేశారు. ప్రభుత్వం మారితే అంగన్వాడీ కార్మికుల కష్టాలు తీరుతాయి అనుకుంటే ఇంకా రెట్టింపయ్యాయని అన్నారు.

## ●ఇంటిపనివారి సమస్యలపై

స్నేహ ఇంటి పని వాళ్ళు సంక్షేమ సంఘం, ఐద్వా ఆధ్వర్యంలో ఈ రోజు పూల్‌బాగ్‌లో ఉన్న సచివాలయం వద్ద నిరసన కార్యక్రమం జరిగింది. ఇంటి పని వాళ్లకు కరోనా కాలంలో ఆర్థిక ఇబ్బందులు పడిన కారణంగా ప్రభుత్వం తమకు ఆర్థికంగా పది వేలు ఇచ్చి ఆదుకోవాలని కార్మికులుగా గుర్తింపు కార్డులు ఇవ్వాలని, ఒంటరి మహిళలకు పింఛన్, ఇంటి స్థలాలు ఇవ్వాలని డిమాండ్ చేస్తూ అధికా రులకు వినతి పత్రం ఇచ్చారు. సుశీల నారాయణమ్మ అన్నపూర్ణ కళావతి సిఐటియు నాయకులు గోపాల్ ఇందిరా పాల్గొన్నారు.

●కె.పుణ్యవతి ఆధ్వర్యంలో గౌడ వీధి సచివాలయం వద్ద ఇంటి పని కార్మికులు ధర్నా చేశారు. బొబ్బిలి పట్టణంలో 13 15 వార్డు కొత్త ●ఎరుకల వీధిలో నిరసన జరిగింది. ●పాత గుంటూరు 3వ వార్డులో ఇంటిపనివారల సమావేశం జరిగింది. ఐద్వా జిల్లా కార్యదర్శి ఎల్.అరుణ మాట్లాడారు.




## అఘాయిత్యాల నివారణలో..

# ప్రభుత్వాలు విఫలం

**రాష్ట్ర వ్యాప్తంగా ప్రజాసంఘాల ఆందోళనల్లో విమర్శ**

**రాష్ట్రంలో బాలికలపైనా, యువతులపైనా, మహిళలపైనా అత్యాచారాలు కొనసాగుతున్నాయి. డాక్టర్ శిల్పి, తూర్పుగోదావరిలో జిల్లాలో ఆరేళ్ల పాపపై అఘాయిత్యాలే ఇందుకు నిదర్శనం. వీటిని నిరసనగా ఐద్వా, ఎస్ఎఫ్ఐ, డివైఎఫ్ఐ ఆధ్వర్యంలో ఆందోళనలు జరిగాయి. మహిలా చట్టాల అమలులో రాష్ట్ర ప్రభుత్వం విఫలమైందనీ, దేశంలో బిజెపి పాలనలో ఇటువంటి దారుణాలు పెరిగాయనీ పలువురు విమర్శించారు. అఘాయిత్యాల నివారణకు బలమైన ఐక్యపోరాటాలు జరగాలనీ పిలుపునిచ్చారు.**

●డాక్టర్ శిల్ప మృతికి కారణమైన నిందితులకు పోస్టింగ్స్ ఇవ్వడాన్ని వ్యతిరేకిస్తూ తిరుపతి మెడికల్ కళాశాల ముందు ఎస్ఎఫ్ఐ–డివైఎఫ్ఐ–ఐద్వా ఆధ్వర్యంలో ఆందోళన చేశారు. నిందితులుగా వున్న వారిపై సస్పెన్షన్ కొనసాగించాలని మెడికల్ కళాశాల ప్రిన్సిపాల్‌కు మెమోరాండం ఇచ్చారు. ●తూర్పుగోదావరి జిల్లాకు చెందిన 6 సంవత్సరాల బాలికపై అఘాయిత్యం జరిగింది. కాకినాడ జిజిహెచ్‌లో బాధితులను పరామర్శించిన ఐక్యవేదిక బృందం న్యాయం జరిగే వరకు అండగా నిలుస్తామని తెలిపారు. ● ప్రేమ పేరుతో తేజస్వినీని హత్య చేయడంపై విజయవాడ లెనిన్ సెంటర్‌లో ప్రజాసంఘాలు ఆధ్వర్యంలో నిరసన తెలిపారు. మహిళా చట్టాలు అమలు చేయడంలో కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తిగా విఫలమైయాయని ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి.రమాదేవి డిమాండ్ చేశారు.ఎస్ఎఫ్ఐ జిల్లా కార్యదర్శి ఎం.సోమేశ్వరావు మాట్లాడారు. ఈ ధనలక్ష్మి, శ్రీ. దేవి జిల్లా కార్యదర్శి నటరాజు, క్రాంతి, సుప్రజ, వెంకటేశ్వరరావు, ఎన్. నాగేశ్వరరావు, ఎన్. కోటబాబు పాల్గొన్నారు.






## గురజాడ అప్పారావు జయంతి

గురజాడ 158 వ జయంతి సందర్భంగా రాష్ట్ర వ్యాప్తంగా ఐద్వా రాష్ట్ర కమిటీ వ్యాసరచన, వక్తృత్వ పోటీలు నిర్వహించింది. ఈ పోటీలలో పాల్గొన్న వారందరికీ ఐద్వా అభినందనలు తెలియచేసింది. మహిళల శ్రమ ఇంటా బయట పెరిగిన నేపథ్యంలో ఈ అంశంపై వ్యాసరచన పోటీలు జరిగాయి. మహిళలు, ఉపాధి అంశంపై వక్తృత్వ పోటీలు జరిగాయి. ఈ పోటీలలో ఝాన్సీ, ఉప, కామాక్షిలు గెలుపొందారు. 21వ తేదీ సాయంత్రం నాలుగు గంటలకు సమానత– ఆటంకాలు అనే అంశంపై ఐద్వా ఏపీ ఫేస్ బుక్ లో లైవ్ కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమంలో యువ రచయిత ఎండ్లూరి మానస, రచయిత హరినాథ్ రెడ్డి పాల్గొని ప్రసంగించారు.

• నంద్యాలలో ఐద్వా, డివైఎఫ్ఐ, సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఐద్వా పట్టణ నాయకురాలు మదార్ బీ అధ్యక్షతన కార్యక్రమం జరిగింది. నరసింహ ,శివ, రాజేష్, విరేంద్ర తదితరులు పాల్గొన్నారు. రత్నమ్మ, డి.హుస్సేన్ భాష,అల్ఫోన్సేస్ మాట్లాడారు.

• కర్నూలు జిల్లా వెబినార్‌లో జంధ్యాల రఘుబాబు పాల్గొన్నారు. తిరుపతిలో రెండు రోజులు ఫేస్‌బుక్ లైవ్‌లో శ్రీదేవి, మస్తానమ్మ, రమాదేవి పాల్గొన్నారు.

• గురజాడ అప్పారావు గారి ఆశయాలు మేరకు మహిళలు ముందడుగు వేయాలని విజయనగరం ఐద్వా జిల్లా కమిటీ పిలుపునిచ్చింది. రమణమ్మ, లక్ష్మీ, పుణ్యవతి 45వ వార్డు మహిళలు పాల్గొన్నారు. • ఐద్వా పశ్చిమ నగర కమిటీ ఆధ్వర్యంలో శ్రీదేవి ముఖ్య వక్తగా




పాల్గొన్నారు. ఐద్వా పశ్చిమ నగర కమిటీ కార్యదర్శి పాలవల్లి, అధ్యక్షురాలు అదిలక్ష్మి, గౌరవాధ్యక్షురాలు శేష మణి, సభ్యులు విజయలక్ష్మి,జయలక్ష్మి ఫరిదా, సదమ్మ, విక్రం లక్ష్మి,వరలక్ష్మి పాల్గొన్నారు.



## తవనం సుబ్బాయమ్మకు నివాళి

తవనం సుబ్బాయమ్మ 6వ వర్ధంతి సందర్భంగా ప్రకాశం జిల్లా మద్దిపాడు మండలం కొలసనకోట, ఒంగోలు, కందుకూరులలో సుబ్బాయమ్మ చిత్రపటానికి పూలమాల వేసిన నివాళి అర్పించారు. మున్వర్, మల్లిక, మనోజ, రమాదేవి, సీత, ఆదిలక్ష్మీ తదితరులు పాల్గొన్నారు.

## గుర్రం జాషువా జయంతి

విశాఖ నగరంలో నూజివీడు పట్టణ కమిటీల ఆధ్వర్యంలో రాష్ట్ర కమిటీ ఇచ్చిన పిలుపు మేరకు గుర్రం జాషువా 125వ జయంతి జరిగింది. ఐక్య ఉపాధ్యాయ సంఘం కృష్ణా జిల్లా కార్యదర్శి మాట్లాడారు. గుర్రం జాషువాకు నివాళి అర్పించారు. సంఘ అధ్యక్షురాలు, న్యాయవాది నందూరి పద్మాంజలి సభ్యులకు ఎస్‌సి, ఎస్‌టి అట్రాసిటీ చట్టం గురించి అవగాహన కల్పించారు. ఈ కార్యక్రమంలో గౌరవాధ్యక్షురాలు మద్దాలి లక్ష్మి, పట్టణ ఐద్వా కార్యదర్శి పుట్టి కమల, సభ్యులు ఇరవా పద్మ, స్రవంతి, అపర్ణ,




కళింగ దుర్గ,కే. రాజేశ్వరి, ప్రేమారాజ్యం పాల్గొన్నారు.

## గాంధీ జయంతి నిరసనలు

తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో గాంధీ జయంతి సందర్భంగా ఐద్వా, ఎస్.ఎఫ్.ఐ, జామాఅతే ఇస్లామీ, హింద్ మహిళా విభాగం కలిసి ఇంద్ర పాలేలాక్స్ నుంచి గాంధీజీ పార్క్ వరకు ప్రదర్శన సాగింది. గాంధీ విగ్రహానికి పూల మాల వేసి నివాళి అర్పించారు. బృందాకరత్, సీతారాం ఏచూరిలపై పెట్టిన అక్రమ కేసులను ఎత్తివేయాలని ఎస్సీ, ఎస్టీ మరియు మహిళలపై దాడులను ఖండించాలని కోరుతూ విశాఖ నగరంలోని పెందుర్తి, అరిలోవ, గాజువాక ఐద్వా కమిటీల ఆధ్వర్యంలో గాంధీ విగ్రహం దగ్గర నిరసన కార్యక్రమంలో ప్రియాంక, సంతోషం మాట్లాడారు. లక్ష్మి, సుభద్ర, స్వర్ణలత, కామేశ్వరి, గౌరీ పాల్గొన్నారు. విజయవాడలో, నంద్యాల, నెల్లూరులలో నిరసన కార్యక్రమాలు నిర్వహించారు. •

**నూజివీడు :** ఫోనుల్లో ఆధునిక టెక్నాలజీని పిల్లలు దుర్వినియోగం చేయుకుండా, నేరస్తులు కాకుండా కాపాడుకోవాలని ఐక్య ఉపాధ్యాయ సంఘం కృష్ణా జిల్లా కార్యదర్శి శ్రీమతి బత్తుల అనురాధ నూజివీడు ఐద్వా సభ్యులతో ఆన్‌లైన్ సభలో మాట్లాడారు.



# అధిక ధరలపై నిరసన గళం




కూరగాయలు, ఉల్లిపాయలతోపాటు నిత్యావసరాల ధరల విపరీత పెరుగుదలకు వ్యతిరేకంగా రాష్ట్ర వ్యాప్తంగా నిరసన కార్యక్రమాలు జరిగాయి. పశ్చిమ గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో తహసీల్దార్ కార్యాలయం వద్ద నిరసన ప్రదర్శన జరిగింది. ఐద్వా రైతు సంఘం కార్యకర్తలు పాల్గొన్నారు. ఐద్వా జిల్లా కార్యదర్శి గద్దె ఉమశ్రీ, మునగ జ్యోతి, ఎస్ దుర్గాబాయి, వంకాయలపాటి రాణి, సుధారాణి, షేక్ అయేషా, నలమోతు సుందరయ్య పాల్గొన్నారు ● కృష్ణా జిల్లా కొండపల్లిలో జరిగిన నిరసనలో కె.బేబిసరోజిని ఐద్వా, మండల కార్యదర్శి, పార్వతి, జిల్లా, చిట్టెమ్మ,గౌరి, నవీన, పద్మ పాల్గొన్నారు.పెరిగిన కూరగాయల ధరలు, నిత్యావసర సరుకుల ధరలు తగ్గించాలని డిమాండ్ చేశారు. ● ఐద్వా సెంట్రల్ సిటీ కమిటీ ఆధ్వర్యంలో రాజరాజేశ్వరి పేటలో నిరసన కార్యక్రమం చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న ఐద్వా సెంట్రల్ కార్యదర్శి ఝాన్సీ మాట్లాడారు. కరోనా సమయంలో అనేకమంది ఉపాధి కోల్పోయి ఇల్లు గడవక అనేక ఇబ్బందులు పడుతున్న తరుణంలో కూరగాయలు, ఉల్లిపాయలు ధరలు విపరీతంగా పెరిగి సామాన్యులకు అందని స్థాయికి చేరాయని అన్నారు. ప్రభుత్వం ధరలను నియంత్రించి సామాన్యులకు అందుబాటులోకి తేవాలని డిమాండ్ చేశారు. విజయనగరం జిల్లా రామభద్రాపురం, కృష్ణా జిల్లా గంపలగూడెంలలో ధర్నాలు జరిగాయి. ●విశాఖ సిటీ, ఐద్వా జగదాంబ జోన్ కమిటీ ఆధ్వర్యంలో పూర్ణా మార్కెట్ కంచరపాలెంలలో నిరసన కార్యక్రమం జరిగింది. 26 వ వార్డు ఐద్వా స్థానిక కమిటీ సభ్యులు, ప్రజారోగ్య వేదిక నాయకులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు

**ధరల నియంత్రణలో కేరళ ఆదర్శం**

16 రకాల పండ్లు, కూరగాయలకు కేరళ ప్రభుత్వం కనీస ధరలు ప్రకటించింది. ధరల ఒడిదుడుకులు ఏర్పడినప్పుడు రైతులకు, వినియోగదారులకు భరోసా ఇచ్చేలా ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకుంది. నవంబరు 1 నుంచి దీన్ని అమల్లోకి తెస్తోంది.

# స్థానిక సమస్యలపై సమరం




●**పెదకాకాని మండలం** తక్కెళ్ళపాడు రోడ్డు మార్జిన్‌లో 50 సంవత్సరాల నుంచి ఇళ్ళ వేసుకొని నివసించే వారిని ఆర్.అండ్‌బి అధికారులు ఖాళీ చేయమంటే ప్రత్యామ్నాయం చూపించాలని పెదకాకాని తహసీల్దార్ ఆఫీసు వద్ద రిలే దీక్షలను ప్రారంభించి ఐద్వా జిల్లా కార్యదర్శి ఎల్ అరుణ మాట్లాడారు. ● స్థానిక సమస్యలపై **కర్నూలు పట్టణంలో** 37వ వార్డులోని నేతాజీ హౌసింగ్ కాలనీలోని పార్క్‌లో చాలా రోజుల నుంచి లైట్లు వెలగడం లేదని, పిల్లలకు ఆట వస్తువులు ఏర్పాటు చేయాలని పార్కు ఎదురుగా ఉన్న రోడ్డు డౌన్ కావడం వల్ల చుట్టుపక్కల ఉండే డ్రైనేజీ వాటర్ ఇళ్ళ ముందు నిలవడంతో ప్రజలు ఇబ్బంది పడుతున్నారనీ, వెంటనే బాగు చేయించాలని, పార్కును తీర్చి దిద్దాలని నేతాజీ హౌసింగ్ కాలని అసోసియేషన్ మున్సిపల్ మేనేజర్ చిన రాముడుకు వినతి పత్రం ఇచ్చారు. అయన అన్నిటినీ వెంటనే కమిషనర్ గారికి తెలియజేస్తామని హామీ ఇచ్చారు. ఈ కార్యక్రమంలో టీ రాముడు, ఎన్.అలివేలు, అసోసియేషన్ మెంబెర్స్ ఎక్బాల్, బసయ్య, రంగస్వామి, రిటైర్డ్ ఎస్సై నరసింహులు ● **తూర్పుగోదావరి జిల్లా సుబ్బారాయుడిపేట,** మల్లాం గ్రామల్లో సారా అమ్మకాలు వెంటనే అరికట్టాలని కోరుతూ మద్యపాన వ్యతిరేక ప్రచార కమిటీ, ఐద్వా ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం, ఆధ్వర్యంలో స్థానిక అంబేద్కర్ విగ్రహం వద్ద నిరహార దీక్ష జరిగింది. ●మహిళా సంఘాలు, ప్రజా సంఘాల ఐక్య వేదిక సహకారంతో కాకినాడ, కచేరిపేట వరద బాధితులకు సుందరయ్యభవన్‌లో భోజనాలు ఏర్పాటు చేశారు. ●నెల్లూరు నగరంలో 5వ డివిజన్ పరిధిలోని అహ్మద్ నగర్‌లో వరద బాధితులకు భోజనం ప్యాకెట్లు పంపిణీ చేశారు. షేక్ మస్తాన్ బి, శివకమారి ఆ ప్రాంతాలలో పర్యటించి ప్రజల సమస్యలు తెలుసుకున్నారు. ● నంద్యాలలో 22వ వార్డులో వరదలు వచ్చినప్పుడు ఖాళీ స్థలంలో నిండిపోయిన నీరు ప్రవహించకుండా రోడ్డుపైన చెత్తాచెదారం నిలిచిపోవడంతో డివైఎఫ్ఐ, ఐద్వా, ఎస్ఎఫ్ఐ నాయకులు అక్కడికి వెళ్లి ప్రజలతో మాట్లాడి శుభ్రం చేశారు. ఐద్వా జిల్లా కార్యదర్శి రత్నమ్మ గారు, డివైఎఫ్ఐ పట్టణ కార్యదర్శి శివ, ఎస్ఎఫ్ఐ పట్టణ కార్యదర్శి లక్ష్మణ్ అన్నారు.



# ప్రముఖులకు నివాళి


తిరుపతిలో గాంధీ విగ్రహానికి పూలమాలతో నివాళి

మహానేత మహాత్మా గాంధీ, సామాజిక ఉద్యమకారుడు గురజాడ అప్పారావు, గుర్రం జాషువాల జయంతి సందర్భంగానూ, ప్రజా జర్నలిస్టు, రచయిత లంకేష్ వర్ధంతి సందర్భంగానూ 'గళమెత్తుదాం' అంటూ రాష్ట్ర వ్యాప్తంగా ఐద్వా ఆధ్వర్యంలో కార్యక్రమాలు నిర్వహించారు. వారి చిత్రపటాలకు పూలమాలలు వేసి నివాళి అర్పించారు. పలు చోట్ల సభలు నిర్వహించారు. ప్రదర్శనలు చేశారు.


అనంతపురంలో గురజాడ అప్పారావు జయంతిలో...



విజయవాడలో జర్నలిస్టు గౌరీలంకేష్ వర్ధంతి సందర్భంగా...


నంద్యాలలో


కాకినాడలో గాంధీ విగ్రహం వద్ద నివాళి



విజయనగరంలో...


బొబ్బిలిలో గాంధీ విగ్రహానికి వినతి పత్రం ఇస్తూ..

CMVOJA195

Post Reg.No.GTR/104/2020-22 R.NO. APBIL/2019/78298 Published on 5th November 2020 Posting on 7th & 10th November 2020

**CHAITANYA MANAVI Vol : 2, ISSUE : 10, 11 GUNTUR, October, November 2020, 52 pages, Rs.20/-**

# పైశాచికులపై పెల్లుబుకిన ఆగ్రహ జ్వాల



గుంటూరులో మానవహారం

ఉత్తరప్రదేశ్‌లోని హథ్రాస్‌లో యువతిపై హత్యాచార నిందితుణ్ని తక్షణమే శిక్షించాలని ప్రజాసంఘాల ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళనలు జరిగాయి.




చిత్తూరులో కొవ్వొత్తుల ప్రదర్శన



కృష్ణా జిల్లా విస్సన్నపేటలో



ఎర్రబోలులో దిష్టిబొమ్మ దహనం




విశాఖ సిటీలో..




కర్నూలులో




ఒంగోలులో

## చైతన్య మానవి

ఐద్వా రాష్ట్ర కార్యాలయం
31-5-6, ప్రకాశరావు వీధి, మారుతీ నగర్,
చుట్టుగుంట వద్ద, విజయవాడ-4
ఆంధ్రప్రదేశ్,
ఫోన్ : 94900 98620




నెల్లూరులో..



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A 195 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 2\|18\|23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | MOUNIKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |